శ్రీరస్తు.

శ్రీసూర్యనారాయణపరబ్రహ్మణేనమః

ప్రాచీనతాళపత్ర గ్రంథములనుండి

సంగృహీతంబైన

# ప్రశ్నదర్శిని.

అనుఆరూఢ ప్రశ్న శాస్త్రము.

ఇది

చెల్లా నాగలింగశాస్త్రులవారి పుత్రుండగు

## లక్ష్మీనృసింహశాస్త్రిచే

ఆంధ్రతాత్పర్యసహితముగా వ్రాయఁబడి

స్వకీయ శ్రీ

ఆర్యానంద ముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె

ప్రథమ ముద్రణము 500 ప్రతులు.

**1922**

దీని వెల **0—6—0**

# విషయసూచిక.


| విషయము | పుట |
|---|---|
| పరమేశ్వరస్తుతి | 1 |
| రాసులు | ,, |
| రాశ్యధిపతులు | ,, |
| ఉచ్చరాసులు | 2 |
| గ్రహములకువిరోధము | ,, |
| గ్రహములకాలము | ,, |
| గ్రహములసంచారస్థానము | ,, |
| గ్రహదృష్టిక్రమము | 3 |
| గ్రహప్రకృతులు | ,, |
| గ్రహాకారములు | , |
| గ్రహవర్ణములు | ,, |
| గ్రహసంబాధమైనరసము | 4 |
| స్త్రీపురుషగ్రహములు | ,, |
| గ్రహగుణములు | ,, |
| గర్భరాశ్యాదినిర్ణయము | 5 |
| పృష్ఠోదయాదిరాసులు | ,, |
| చతుష్పదాదిరాసులు | ,, |
| మేషాదిరాసులచేప్రశ్న నిర్ణయము | ,, |
| నక్షత్రపాదములచేఆరూఢము | 6 |
| దిగాదిప్రశ్న | ,, |
| తాంబూలప్రశ్న | 7 |
| మరియొకవిధమైనతాంబూలప్రశ్న | ,, |
| కార్యసిద్ధినిర్ణయము | 8 |
| కార్యసిద్ధనిరూపణము | ,, |
| కార్యహానినిరూపణము | 8 |
| కాలవిళంబకార్యసిద్ధి | 9 |
| ౨ దినములలో కార్యసిద్ధి | ,, |
| 3 దినములలో కార్యసిద్ధి | ,, |
| ౪ దినములలో కార్యసిద్ధి | ,, |
| ౯ దినములలో కార్యసిద్ధి | 10 |
| ౧౨ దినములలో కార్యసిద్ధి | ,, |
| ౧3 దినములలో కార్యసిద్ధి | ,, |
| గ్రహజాతి | ,, |
| జీవనిర్జీవప్రశ్న | ,, |
| జీవచింత | 11 |
| ధాతుచింత | 11 |
| గ్రహసంబంధమైనస్వర్ణాదిధాతుచింత | ,, |
| అతీతాదిచింతనాక్రమము | ,, |
| మేషరాశిఫలము | 12 |
| వృషభరాశిఫలము | ,, |
| మిథునరాశిఫలము | ,, |
| కటకరాశిఫలము | 13 |
| సింహరాశిఫలము | ,, |
| కన్యారాశిఫలము | ,, |
| తులారాశిఫలము | ,, |
| వృశ్చికరాశిఫలము | ,, |
| ధనూరాశిఫలము | 14 |
| మకరరాశిఫలము | ,, |

| | | | |
|---|---|---|---|
| కుంభ రాశి ఫలము | 14 | చోరద్రవ్యముదూరసమీపము | |
| మీన రాశి ఫలము | ,, | ములయందున్న వనుట | 28 |
| ధనస్థానాది భావములు | ,, | నష్టద్రవ్యచింత | 29 |
| ప్రశ్న చక్రము | 16 | నష్టద్రవ్యముఫలానిదనుట | ,, |
| భోజనద్రవ్యాదినిర్ణయము | 17 | నష్టద్రవ్యమువుస్థలము | 30 |
| దూతిలక్షణము | 18 | నష్టద్రవ్యసిద్ధివివరము | ,, |
| దేశాంతరప్రశ్న | | చతుష్పదాదిజీవచింత | 31 |
| ఆయుఃప్రశ్న | 19 | ఆరూఢవిషయము | ,, |
| సిద్ధిప్రశ్న | 20 | వివాహప్రశ్న | 32 |
| పశుప్రశ్న | ,, | గర్భప్రశ్న | 35 |
| చోరప్రశ్ననిర్ణయము | 21 | వ్యాధిప్రశ్న | 36 |
| చోరవయోనిర్ణయము | 22 | వృష్టిప్రశ్న | 37 |
| చోరజాతినిర్ణయము | ,, | కూపప్రశ్న | 38 |
| చోరునిలక్షణము | 23 | షరాశక్తిచక్రనిర్ణయము. | 40 |
| చౌర్యముపురుషునిచేచేయబడిన దనుట | 24 | మరివకశుభాశుభప్రశ్నచక్రమ్ | 43 |
| | | తత్ఫలము | ,, |
| స్త్రీపురుషచోరనిర్ణయము | 25 | దేవతాప్రశ్న | 45 |
| చోరహృతభూషణాదివివరము | ,, | ॰రప్రశ్న | 45 |
| చోరద్రవ్యస్వరూపము | 26 | షోడశాక్షరీప్రశ్నచక్రము | 46 |
| చోరద్రవ్యమువుస్థానము | ,, | గ్రహసంఖ్యాప్రశ్న | 46 |
| చోరసితదిక్కు | 27 | వారనక్షత్రయుక్తపంథాప్రశ్న | 47 |
| పోయినసొమ్ములభించదనుట | 28 | బాలప్రశ్న | 48 |
| పోయినసొమ్ముదొరుకుననుట | ,, | | |


సమాప్తము.

ఓమ్ పరబ్రహ్మణేనమః.

# ప్రశ్నదర్శని.

### పరమేశ్వరస్తుతిః.

శ్లో॥ ఓంనమోభగవతేతస్మై యతయేసచ్చిదాత్మనే।
పురుషాయాదిబీజాయ పరేశాయమహాత్మనే॥

తా॥ ప్రపంచమునకు కారణకర్తయు జ్ఞానస్వరూపుడును షడ్గుణైశ్వర్యసంపన్నుండగు అభవంతునికొఱకు నమస్కారము.

### రాశులు

శ్లో॥ మేషస్తతోవృషశ్చైవ తతోమిథునకర్కటౌ। సింహఃకన్యాతులాచైవ వృశ్చికశ్చతతఃపరం। ధనుశ్చమకరశ్చైవ కుంభశ్చైవతతఃపరం మీనస్తతో మునిభిః రాశయోద్వాదశస్మృతాః॥

తా॥ రాశులు. ౧మేషము. ౨వృషభము. ౩మిథునము. ౪కర్కాటకము. ౫సింహము. ౬కన్య. ౭తుల. ౮వృశ్చికము. ౯ధనస్సు. ౧౦మకరము. ౧౧కుంభము. ౧౨మీనము. ఈ౧౨రాశులని మునులు చెప్పిరి.

### రాశిపతులు.

శ్లో॥ రవిహరీశ్వరశ్చంద్రః కర్కటేశ్వరఉచ్యతే। కుజోపిమేషయోరీశో మిథునాంగనయోర్బుధః। జీవఃకోదండమీనేశస్తులావృషభయోఃకవిః। శనిర్మకరకుంభేశ ఏవంరాశ్యధిపాస్స్మృతాః॥

తా॥ సూర్యుడుసింహమునకును, చంద్రుడుకర్కాటకమునకును, అంగారకుడు మేషవృశ్చికములకును, బుధుడుకన్యామిథునములకును, బృహస్పతిధనుర్మీనములకును, శుక్రుడుతులావృషభములకును, శని మకరకుంభములకును, అధిపతులు. ఈప్రకారముగా రాశ్యధిపతులు.

## ఉచ్చరాసులు.

శ్లో॥ సూర్యస్య మేష ఉచ్చస్స్యాచ్ఛీతాంశోర్వృషభస్స్మృతః॥ భౌమస్య మకరః ప్రోక్తః కన్యా సౌమ్యస్య చోచ్చకః॥ గురోశ్చ కటకం ప్రాహుస్తుంగం మీనం తథా భృగోః॥ శనైశ్చరస్య చ తులా రాశిరుచ్చస్స్మృతో బుధైః॥ రాహోస్తు స్వగృహం కన్యా వృశ్చికస్తుంగ ఈరితః। కేతోశ్చ స్వగృహం మీనం వృషభస్తుంగ సంజ్ఞకః॥ ఉచ్చరాశేస్సప్తమస్తు రాశిర్నీచః ప్రకీర్తితః॥

తా॥ సూర్యునికి మేషము, చంద్రునికి వృషభము, అంగారకునికి మకరము, బుధునికి కన్య, గురువుకు కటకము, శుక్రునికి మీనము, ఉచ్చరాసులు రాహువుకు వృషభము, కేతుకు మీనము, ఉచ్చరాసులు. ఏ గ్రహములకు యే రాసి ఉచ్చరాసి యోదాని కేడవ రాసి నీచరాసి అని తెలియవలయును.

## గ్రహములకు విరోధము.

శ్లో॥ గురుశుక్రయోశ్చ వైరం బుధచంద్రయోస్తథైవ స్యాత్। శనిసూర్యయోర్విరోధః శనిభూమిజయోస్తథైవ విద్వేషః॥ రాహుశ్చ సప్తమస్థానస్థిత ఖేటస్య శాత్రవ। ఏవం గ్రహాణాం విజ్ఞేయా పరస్పర విరోధితా॥

తా॥ గురుశుక్రులకును, బుధచంద్రులకును, శనిసూర్యులకును, శనికుజులకును, శత్రుత్వము. రాహువునకు ేడవయింటనుండు గ్రహము శత్రువు ఇట్లు గ్రహములకు పరస్పర శత్రుత్వములను తెలుసుకొనవలయును

## గ్రహముల కాలము.

శ్లో॥ ప్రభాత ఇందుజగురూ మధ్యాహ్నే రవిభూమిజౌ। అపరాహ్ణే భార్గవేందూ సంధ్యాయాం మంద భుజంగమౌ॥

తా॥ బుధగురువులు ప్రాతఃకాలమునకును, సూర్యుడు, కుజుడు, మధ్యాహ్నమునకును, శుక్రుడు, చంద్రుడు అపరాహ్ణమునకును, శని, రాహువులు సంధ్యాకాలమునకును అధిపతులుగనుందురు.

## గ్రహముల సంచారస్థానము.

శ్లో॥ భార్గవేందూ జలచరౌ జ్ఞజీవౌ గ్రామచారిణౌ। రాహుః క్షితిజమందార్కా ఉచ్చం తే వనచారిణః॥

తా॥ శుక్రచంద్రులుజలగ్రహములు, బుధగురులు, గ్రామమునందుసంచరించువారు. రాహువు, కుజుడు, శని, సూర్యుడు, వీరలువనమున సంచరించువారు. అని తెలుసుకొనవలయును.

### గ్రహదృష్టిక్రమము.

శ్లో॥ తిర్యగ్దృష్టిబుధసితౌభౌమార్కావూర్ధ్వదర్శినౌ। జీవేందూసమదృష్టీచ రాహుమందావధోదృశౌ॥

తా॥ బుధశుక్రులుఅడ్డచూపుగలవారుగను, కుజుడుసూర్యుడుపైచూపుగలవారుగను, గురుచంద్రులుసమదృష్టిగలవారుగను, శనిరాహువులుక్రిందచూపుగలవారుగ నుందురు.

### గ్రహప్రకృతులు.

శ్లో॥ పిత్తంప్రభాకరకుజౌ శ్లేష్మంభార్గవశీతగూ। సమధాతూజీవబుధౌ వాతితా రాహుమందకౌ॥

తా॥ సూర్యుడుకుజుడుపిత్తకారకులు, శుక్రుడుచంద్రుడు శ్లేష్మకారకులు, గురుబుధులు సమధాతుకారకులు, రాహుశనులు వాతికారకులుగనుందురు.

### గ్రహాకారములు.

శ్లో॥ స్థూలశ్చంద్రఃసితఃఖండంచతురశ్రౌకుజార్కకౌ । వర్తులౌసౌమ్యధిషణౌదీర్ఘౌమందభుజంగమౌ॥

తా॥ చంద్రుడులావుగ, శుక్రుడుతునకలుగ, సూర్యాంగారకులు చచ్చౌకముగ, గురుబుధులుగుండ్రముగ, శనిరాహువులు నిడుపుగానుందురు.

### గ్రహవర్ణములు.

శ్లో॥ రక్తవర్ణౌకుజార్కౌచధిషణఃకాంచనద్యుతిః । శుకపింఛసమస్సౌమ్యఃగౌరకాంతిరనుష్ణగుః। కవిరత్యంతధవళఃషణిఃకృష్ణశ్శనిస్తథా। మందారోద్భవపుష్పతునద్యుతిరనుష్ణగుః॥

తా॥ సూర్యాంగారకులు రక్తవర్ణముగలవారుగ, గురువుబంగారువర్ణముగలవాడుగ, బుధుడుపచ్చవర్ణముగలవాడుగ, చంద్రుడు తెలుపువర్ణముగలవాడుగ, శుక్రుడుమిగుల తెలుపువర్ణము గలవాడుగ, శనిరాహువులునలుపువర్ణముగలవారుగ నందురు. చంద్రుడుమందారపుష్పమువంటివర్ణముగలవాడని కొందరిమతము.

## గ్రహసంబంధమైనరసము.

శ్లో॥ కుజార్కాకటుకౌజీవోమధురస్తువరోబుధః । క్షారామ్లాచంద్ర భృగుజౌతిక్తౌసర్పార్కనందనౌ॥

తా॥ సూర్యాంగారకులుకటురసమునకును, గురువుమధురరసమునకును, బుధుడువగరురసమునకును, చంద్రుడులవణరసమునకును, శుక్రుడుఆమ్లరసమునకును, శనిరాహువులుచేదురసము నకును, అధిపతులుగానుందురు.

## స్త్రీపురుషగ్రహములు.

శ్లో॥ మంత్రిమహీశమార్తాండానుశంసిపురుషాః బుధాః॥ సోమశ్శశిజమందాహిభృగుపుత్రాశ్చయోషితః॥

తా॥ గురువు, అంగారకుడు, సూర్యుడు, వీరుపురుషులు. చంద్రుడు, బుధుడు, శని, రాహువు, శుక్రుడు, వీరుస్త్రీలుఅని తెలియవలెను

## గ్రహగుణములు.

శ్లో॥ మందార్కభౌమభోగీంద్రవక్రనేద్దుఃఖదాగుణాః॥ జ్ఞగురౌశీతకిరణఃశుక్రశ్చసుఖదాస్సదా॥

తా॥ శని, సూర్యుడు, అంగారకుడు, రాహువువీరలుదుఃఖమును గలుగజేయునట్టిస్వభావముగలవారు. బుధుడు, గురువు, చంద్రుడు, శుక్రుడు, వీరలుయెల్లపుడు సుఖమునుగలుగజేయు స్వభావము గలవారు. ప్రశ్నలగ్నమునందుశనిసూర్యులుండినదుఃఖప్రశ్నయనియు, బుధాదులుండినసుఖప్రశ్నయనియు తెలుసుకొనవలయును.

## గర్భరాశ్యాదినిర్ణయము.

శ్లో॥ ధనుర్మీనశ్చకన్యాచ మిధునంగర్భరాశయః । మేషకర్కటతులానక్రాః చత్వారోద్వారరాశయః॥ వృషస్సింహాశ్చకుంభశ్చవృశ్చికోబాహ్యారాశయః॥

తా॥ ధనస్సు, మీనము, కన్యా, మిధునము, ఇవిగర్భరాసులు. మేషము, కర్కాటకము, తులా, మకరము ఇవిద్వారరాసులు. వృషభము, సింహము, కుంభము, కన్యా ఇవిబాహ్యారాసులు అనిచెప్పబడును.

## పృష్ఠోదయాదిరాసులు.

శ్లో॥ చాపోక్షకర్కినక్రాజాస్తేపృష్ఠోదయతారాశయః । తిర్యజ్మీనస్తథాశేషారాశయో మస్తకోదయాః॥

తా॥ ధనస్సు, వృషభము, కటకము, మకరము, మేషము, ఇవిపృష్ఠోదయరాసులు. మీనము, తిర్యగుదయరాశి. యితరరాసులన్నియు శిర్షోదయరాసులు.

## చతుష్పదాదిరాసులు.

శ్లో॥ చతుష్పదామేషవృషసింహచాపాభవంతిహి । కుళీరాళీబహుపదాఃపక్షిణౌమృగమీనభౌ।ద్విపదాకుంభమిధునతులాకన్యాస్సమీరితాః॥

తా॥ మేషము, వృషభము, సింహము, ధనస్సు, ఇవిచతుష్పదరాసులు. కటకము, వృశ్చికము, ఇవిబహుపదరాసులు. మకరము, మీనము, ఇవిద్విపాదరాసులు. అనితెలుసుకొనవలయును.

## మేషాదిరాసులచేప్రశ్ననిర్ణయము.

శ్లో॥ మేషేద్విపాదచింతాస్యాద్వృషభేచచతుష్పదాం। మిధునేగర్భచింతాచకర్కటేవ్యావహారకీ। సింహేతురాజచింతాస్యాత్కన్యాయాంస్త్రీవిచింతనం। తులాయాంధాతుచింతాచవృశ్చికేరోగచింతనం । చాపేయాత్రావిచింతాస్యాత్ నక్రేకలహచింతనం। కుంభేతుధాన్యచింతాస్యాన్మీనేనిస్కరచింతనమ్॥

తా॥ ప్రశ్నలగ్నము మేషమైతే ద్విపాదచింతయనియు, వృషభమైతే పశువులు మొదలగు చతుష్పాదప్రశ్నయనియు, మిధునమైతేగర్భప్రశ్నయనియు, కటకమైతేవ్యవహారచింతయనియు, సింహమయితేరాజచింతయనియు, కన్యఅయితేస్త్రీప్రశ్నయనియు, తులఅయితేధాతుప్రశ్న అనియు, వృశ్చికమయితేరోగప్రశ్నయనియు, ధనస్సుఅయితేయాత్రాప్రశ్నయనియు, మకరమైతేకలహప్రశ్నమనియు, కుంభమైతేధాన్యప్రశ్నమనియు, మీనమైతేచోరప్రశ్నమనియు, తెలుసుకొనవలయును.

నక్షత్రపాదములచేఆరూఢము.

శ్లో॥ అష్టాధికశతేసంఖ్యా మేకాంబ్రూహీతిపృచ్ఛకమ్ । పృష్ట్వా తేనోక్తసంఖ్యాయా మశ్విన్యాదృక్షపాదతః । మేషాదరాశేరేకస్య నవపాదాఇతిక్రమాత్ । మేషాదిరాశీన్నిశ్చిత్య ఫలంబ్రూయాద్విచక్షణః ॥

తా॥ ప్రశ్నఅడగవచ్చినవానిని ౧౦౮ లో నొకసంఖ్యచెప్పుమనిఅడిగి వానిచే చెప్పబడిన సంఖ్యను మేషాది రాసులలో రాశి ఒకటింటికి ౯ పాదములచొప్పున భాగించి లగ్నమును నిర్ణయించుకొనవలయును- యెట్లనగా ౧౦౮లో చెప్పినసంఖ్య ౨౨ దానిని రాశిగకి౯పాదములచొప్పున మేషాదిగా మేషలగ్నములకు పాదములు౯వృషభ లగ్నమునకు పాదములు ౯ వెరశి ౧౮పోను నిలవపాదములు ౪ కి మిధున లగ్నమని తెలుసుకొనవలయును-

దిగాదిప్రశ్న.

శ్లో॥ తత్కాలతిధివారర్క్ష యామాన్ శ్చైవదిశంతథా । ప్రత్యేకం గణయిత్వాతాం సంఖ్యామేకీకృతాంపునః । ఆహృత్యచాష్టభిర్భాగం శేషేనైవంవదేత్ఫలమ్।

తా॥ ప్రశ్నఅడిగేకాలమునందుండు తిధిని పాడ్యమిమొదలుగ, వారమును ఆదివారముమొదలుగ, నక్షత్రమును అశ్విన్యాదిగా, ఝామును మొదటిఝాముమొదలుగా ప్రశ్నఅడిగినదిక్కును తూర్పుమొదలుగా వీటినిలెక్కించి ఆసంఖ్యలను ఒకటిగాచేర్చి ౮ దింట భాగించి మిగిలిన సంఖ్యచేత ఫలమును చెప్పవలయును-

శ్లో॥ ఏకస్మిన్నవశిష్టేతు త్రితయేసప్తమేతథా । వింశత్యాదివసైః కార్య సిద్ధస్యాదితినిశ్చయః । ద్వితయేచాష్టమేనైవ కార్యసిద్ధిర్భవేద్ధ్రు

వమ్ । అవశిష్టే చతుర్థే తు షష్ఠే చైవ దినత్రయాత్ । పంచమే త్వరితా సిద్ధి రేవం కాలవిదో విదుః ॥

తా॥ ౧, ౩, ౭, మిగిలితే ఇరువైదినములలో, కార్యము నిశ్చయముగా నగును. ౨ -౦ మిగిలితే కార్యము కానేరదు- ౪, ౬, మిగిలిన మూడుదినములలోపల కార్యము సిద్ధించును- ౫ మిగిలితే శీఘ్రముగా కార్యమగును- అని జ్యోతిశ్శాస్త్రవేత్తలు కాలనియమమును చెప్పియున్నారు-

## తాంబూలప్రశ్న.

శ్లో॥ పృచ్ఛకస్తు స తాంబూలం దక్షిణాఫలమానయేత్ । దైవజ్ఞః పర్ణమాదాయ గణయేత్తద్యథాక్రమమ్ । నాగపర్ణస్య గణనాం ద్విగుణీకృత్య తద్ధ్రువమ్ । హరేద్ద్వాదశభిర్భాగం చింతయేచ్ఛిష్టసంఖ్యయా । మేషాదిమీనపర్యంతాన్ రాశీన్ సమ్యగ్వినిర్ణయేత్ ॥

తా॥ ప్రశ్న అడుగువారు తాంబూలము, దక్షిణ, ఫలములు వీటిసహితముగా దైవజ్ఞుని కడకేగి తాంబూలాదులనిచ్చి ప్రశ్న అడుగవలయును దైవజ్ఞుడు తమలపాకులను యెంచి ఆమొత్తమును రెట్టించి ౧౨ డింట భాగించగా మిగిలినసంఖ్యచే మేషాదిరాశులను నిర్ణయముజేసుకొనవలయును ( అనగా ౧ మిగిలితే మేషము ౨ మిగిలితే వృషభము ఇటులమీనరాశిపర్యంతము లగ్నమును నిర్ణయించుకొనవలయును )

## మఱియొకవిధమైన తాంబూలప్రశ్న.

శ్లో॥ పర్ణక్రమముకయోస్సంఖ్యాం త్రిగుణీకృత్య తద్ధ్రువం । ఆహృత్య షడ్భిర్భాగం తత్కాలవిచ్ఛిష్టసంఖ్యయా । లాభం హానిం సుఖం దుఃఖం జీవనం మరణం క్రమాత్ । దక్షిణాం పృచ్ఛకానీతాం తామ్రం యూప్యం సువర్ణకం । ఏకైకం గణయిత్వాథ ద్విగుణీకృత్య తద్ధ్రువం । నవభిర్భాగమాహృత్య దైవజ్ఞశ్శేషసంఖ్యయా । సూర్యాదీన్ కేతుపర్యంతాన్ గ్రహాన్ సమ్యగ్వినిర్ణయేత్ ।

తా॥ తమలపాకులు వక్కలు వీటిని ప్రత్యేక ప్రత్యేకముగా లెక్కించి ఆసంఖ్యలను ఒకటిగాజేర్చి ఆమొత్తమును మూడింట హెచ్చుగుణించి దానిని ఆరింట భాగించగా ౧ మిగిలిన లాభము, ౨ మిగిలిన హాని, ౩ మిగిలిన సుఖము ౪ మిగిలిన దుఃఖము ౫ మిగిలిన జీవనము ౬ మిగిలిన మరణమని క్రమముగా మిగిలినసంఖ్యలను పట్టి ఫలములను చెప్పవలయును ప్రశ్న అడుగువారు తెచ్చిన తామ్రము, లేక వెండి, లేక సువర్ణము, ఈవిధముగ నుండు ద్రవ్యమును వేర్వేరుగ లెక్కించి దానిని రెంటిచే హెచ్చుగుణించి ౯ దింట భాగించగా

మిగిలినసంఖ్యచేత. సూర్యాదిగ్రహములను నిర్ణయించుకొనవలయును ౧ మిగిలినసూర్యుడు ౨ మిగిలిన చంద్రుడు ఈప్రకారము కేతువరకు గ్రహములనిశ్చయించుకొనవలయును-

## కార్యసిద్ధినిర్ణయము.

శ్లో॥ ఆరూఢప్రశ్నలగ్నేషు త్రికోణే కేంద్రకేపి వా ।
గురుశ్శుక్రో బుధశ్చంద్రః తత్ఫలం సఫలం భవేత్ ।

తా॥ ఆరూఢలగ్నమునకు త్రికోణములయందుగాని కేంద్రస్థానములయందుగాని గురువు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు వీరిలో అందరుగాని, లేక కొందరుగాని వుండిన కార్యము సిద్ధించునని చెప్పవలయును-

## కార్యసిద్ధినిరూపణము.

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపో జీవ శుక్రాభ్యాం సహితో యది ।
వీక్షితో వా తదా కార్యం శీఘ్రమేవ ప్రసిద్ధ్యతి ॥

తా॥ ఆరూఢలగ్నాధిపతి గురుశుక్రులతో గూడియుండినను, లేక వార్లచే చూడబడినను పృచ్ఛకుని కార్యము శీఘ్రముగా సిద్ధించును-

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపే లాభే కార్యస్థే లగ్నగేపి వా ।
గురుణా చైవ సందృష్టే కార్యసిద్ధిర్న సంశయః ।

తా॥ ప్రశ్నలగ్నాధిపతి లాభస్థానమునందుగాని, కార్యస్థానమునందుగాని, ఆరూఢలగ్నమునందుగాని యుండి గురువుచే చూడబడిన కార్యము వశ్యము సిద్ధించును-

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపః కోణే లాభేశో లగ్నమాశ్రితః ।
చంద్రేణ వీక్షితశ్చాపి కార్యసిద్ధిర్భవేద్ధ్రువమ్ ॥

తా॥ ప్రశ్నలగ్నాధిపతి త్రికోణములయందును లాభాధిపతి ఆరూఢలగ్నమునందునుయుండి చంద్రునిచే చూడబడిన తప్పక కార్యము సిద్ధించును.

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపస్సూర్యః కార్యస్థానగతో యది ।
కార్యేశః ప్రశ్నలగ్నస్థః తత్కాలే నైవ సిద్ధ్యతి ॥

తా॥ ప్రశ్నలగ్నాధిపతి సూర్యుడుగనుండి కార్యస్థానమును జెంది కార్యస్థానాధిపతి ఆరూఢలగ్నములో నుండిన కార్యము తత్క్షణమే సిద్ధించును-

## కార్యహాని నిరూపణము.

శ్లో॥ ప్రశ్నలగ్నం యది క్రూర దృష్టం పాపసమన్వితం ।
తదీశః పాపసందృష్ట యుక్తో వా కార్యహానిదః ॥

తా॥ ఆరూఢలగ్నము పాపగ్రహములతో గూడి యుండినను లేక పాపగ్రహములు చూచినను ఆరూఢలగ్నాధిపతి పాపగ్రహములతో గూడియుండినను లేకపాపులచే చూచినను కార్యము కానేరదు-

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపో రాహుః శనిస్వక్షేత్రసంస్థితః ।
ద్వాదశేగురుశుక్రౌచ కార్యహానిర్న సంశయః ॥

తా॥ ప్రశ్నలగ్నాధిపతిరాహువు అయి శనిస్వక్షేత్రములోను, ౧౨వ ఇంటగురు శుక్రులను చేరియుండిన కార్యహానియగును-

## కాలవిళంబకార్యసిద్ధి.

శ్లో॥ ప్రశ్నలగ్నంస్థిరంపాప శుభసంబాధవర్జితం । అర్కపుత్రేణ సంవృష్టం యదిస్యాత్కార్యహానివత్ । ప్రథమందృశ్యతేపశ్చాత్సంవత్సరవిళంబతః । నియతంకార్యసిద్ధిస్స్యాదిత్యేవంనిర్దిశేద్బుధః ॥

తా॥ ఆరూఢలగ్నము స్థిరరాశిగానుండి పాపశుభసంబంధములేకనే శనిచేమాత్రము చూడబడిన యెడల తొలుత కార్యహానివలెకనిపించిపిదప ౧ సంవత్సరములో నిశ్చయముగా కార్యముసిద్ధించును-

## ౨ దినములలో కార్యసిద్ధి

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపశ్చంద్రః కేంద్రకోణగతోపివా ।
కార్యాధిపేనసంవృష్టః ద్విదినేకార్యసిద్ధిదః ॥

తా॥ ప్రశ్నలగ్నాధిపతి చంద్రుడై కేంద్రకోణములను పొంది కార్యాధిపతిచే జూచినయెడల ౨ దినములలోపల కార్యముసిద్ధించును.

## 3 దినములలో కార్యసిద్ధి.

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపో భౌమః లాభస్థానగతోపివా ।
చంద్రేణవీక్షితస్స్యాచ్చే త్రిదినేకార్యసిద్ధిదః ॥

తా॥ కుజుడుప్రశ్నలగ్నాధిపతియై లాభస్థానము నందుచేరి చంద్రునిచే జూడబడినయెడల 3 దినములలోపల కార్యమగును.

## ౫ దినములలో కార్యసిద్ధి.

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపస్సౌమ్యః స్వక్షేత్రస్వోచ్చగతోపివా ।
భార్గవేనచసంవృష్టః కార్యంపంచదినేభవేత్ ॥

తా॥ బుధుడు ప్రశ్నలగ్నాధిపతియై స్వక్షేత్రమునందు గానియుచ్చక్షేత్రమునందు గానియుండి శుక్రునిచేజూడబడిన ౫ దినములలోపల కార్యము సఫలమగును.

౯ దినములలో కార్యసిద్ధి.

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపేపూర్జ్యే ధనస్థానసమాశ్రితే ।
రవినాచైవసంద్రుష్టే కార్యంనవదినైర్భవేత్ ॥

తా॥ గురువుప్రశ్న లగ్నాధిపతియైధనస్థానమును జెంది సూర్యునిచే జూడబడిన యెడల తొమ్మిది దినములలోపల కార్యమగును.

౧౨ దినములలో కార్యసిద్ధి.

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపశ్శుక్రః కార్యస్థానగతోయది ।
బుధేనవీక్షితశ్చాపి ద్వాదశే కార్యసిద్ధిదః ॥

తా॥ శుక్రుడు ప్రశ్నలగ్నాధిపతియై కార్యస్థానమును జెంది బుధునిచేజూడబడిన ౧౨ దినములలోపల కార్యముసిద్ధించును.

౧౩ దినములలో కార్యసిద్ధి.

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపోమందః త్రిషడాయగతోయది ।
శుక్రేణవీక్షితశ్చాపి త్రయోదశదినేఫలమ్ ॥

తా॥ ఆరూఢలగ్నాధిపతిశనియై 3, ౬, ౧౧. ఈ స్థానములలోనుండి శుక్రునిచే చూడబడిన యెడల ౧౩ దినములలో కార్యముసిద్ధించును.

గ్రహజాతి.

శ్లో॥ విప్రౌశుక్రగురూప్రోక్తౌ కుజార్కౌక్షత్రియౌబుధః ।
ఇందుఃవైశ్యస్స్మృతోమ్లేచ్ఛౌ సైంహికేయశనైశ్చరా॥

తా॥ గురు, శుక్రులు బ్రాహ్మణజాతి, సూర్యాంగారకులు క్షత్రియజాతి, బుధ చంద్రులు, వైశ్యజాతి, శని శూద్రజాతి, రాహువుమ్లేచ్ఛజాతి అని తెలుసుకొనవలయును.

జీవనిర్జీవప్రశ్న.

శ్లో॥ ప్రశ్నాక్షరంద్విగుణితం తత్కాలఘటికాన్వితం ।
హృత్వాద్వాదశభిశ్శేషే జీవనిర్జీవచింతనం ॥

తా॥ ప్రశ్నాక్షరములను లెక్కించి ఆసంఖ్యను రెట్టించి ఆప్రశ్న కాలఘటికలను వుదయాదిగాచేర్చి అయిన మొత్తమును ౧౨ చేత భాగించి మిగిలినసంఖ్యలచే జీవచింత, నిర్జీవచింత అని చెప్పవలయును.

శ్లో॥ రామబాణరసానాగ నందిరుద్రైశ్చ జీవతి ।
రూపపక్షయుగంసప్త దశభానుర్న జీవతి ॥

తా॥ ౩, ౫, ౬, ౭, ౯, ౧౧ ఈసంఖ్యలు మిగిలిన జీవచింతయనియు, ౧, ౨, ౪, ౮, ౧౦, ౧౨ ఈసంఖ్యలు మిగిలిన నిర్జీవచింతయనియు చెప్పవలయును.

## జీవచింత.

శ్లో॥ ద్విపాదా భార్గవగురూ భౌమార్కౌచ చతుష్పదౌ ।
పక్షిణౌ బుధసౌరీచ చంద్రరాహూ సరీసృపౌ ॥

తా॥ గురుశుక్రులు ద్విపాద జంతువులకును, సూర్యాంగారకులు చతుష్పాదజంతువులకును, బుధశనులు పక్షులకును, చంద్రరాహువులు సర్పములకును అధిపతులుగనుందురు- వీనినిబట్టి ద్విపాదాదిచింతలను చెప్పవలయును.

## ధాతుచింత.

శ్లో॥ మందేందురాగభౌమాస్స్యుః ధాతుస్సవితృభార్గవౌ ।
మూలస్యజీవసౌమ్యస్స్య జీవంప్రాహుర్మహర్షయః ॥

తా॥ శని, చంద్రుడు, రాహు, వీరు ధాతుచింతకును, సూర్యుడు, శుక్రుడు మూల చింతకును; గురువు, బుధుడు జీవచింతకును; కారకులుగ నుందురని మహర్షులు వచించెదరు.

## గ్రహసంబంధమైన స్వర్ణాదిధాతుచింత.

శ్లో॥ శుక్రేచంద్రేచ రజతం బుధేస్వర్ణం సమీరితం । గురౌ రత్నమయంహైమం సూర్యేమౌక్తికముచ్యతే । భౌమేత్రపుశనౌలోహం రాహౌవస్త్రీనికీర్తయేత్ । ధాతోశ్చనిశ్చయోజ్ఞేయః విశేషస్సముదాహృతః ॥

తా॥ శుక్రచంద్రులు వెండికిని, బుధుడు బంగారునకును, గురువు రత్నములకును, అపరంజికిని, సూర్యుడు ముత్తియములకును, అంగారకుడు సీసమునకును, శని ఇనుమునకును, రాహువు రొముకలకును, కారకులుగ నుందురు. పైగ్రహములనుబట్టి నాయా ధాతుచింతలను నిశ్చయించుకొనవలయును.

## అతీతాది చింతనాక్రమము.

శ్లో॥ అతీతంచింతయేన్నానా ద్వర్తమానంచలగ్నతః ।
అంశాద్భవిష్యద్వృత్తంచ కార్యాకార్యేషునిగ్రహాత్ ।

తా॥ తన్వాదిభావములనుపట్టి గడిచిపోయిన విషయమునున్ను, లగ్నమునుపట్టి వర్తమానవిషయమునున్ను, అంశమునుపట్టి భవిష్యద్విషయమునున్ను, గ్రహములనుపట్టి కార్యాకార్యస్థితులను నిశ్చయించుకొనవలయును.

శ్లో॥ ఉదయాద్యాదిభావానాం అథపార్శ్వంతయేత్తతః ।
తదన్వంశాధిపోయస్మిన్నానాభావేవిచారయేత్ ॥

తా॥ తొలుత ఉదయాదిభావాధిపతులను నిశ్చయించుకొని పిదపఅంశాధిపతులు యేయేభావమునందున్నారో ఆభావమునుపట్టి ప్రశ్నకార్యమును నిశ్చయింపవలయును

శ్లో॥ భావశ్చకార్యరూపోయః తల్లగ్నాధిపతిశ్చయః ।
యద్భావేతేనసందృష్టః సర్వాందృష్ట్వావిచింతయేత్ ॥

తా॥ భావము, కార్యము, భావకార్యస్థానాధిపతులు, భావాదివీక్షణములు, వీని నన్నిటిని చక్కగాచూచి కార్యమును నిశ్చయించవలయును.

శ్లో॥ భావాస్వభావలగ్నాచ్చ స్వరూపంచింతయేత్తతః ।
తద్వీక్ష్యగ్రహహోరాత్మా యత్కార్యంచార్యతేసమః ॥

తా॥ భావలగ్నము దానిస్వభావము వీటినిజూచి కార్యస్వరూపము పలానిదని తెలుసుకొని గ్రహస్వభావమునుపట్టి కార్యమునునిశ్చయించుకొనవలయును.

---

## మేషరాశిఫలము.

శ్లో॥ అజాయదిప్రశ్నలగ్నం వ్యవహారభయంభవేత్ ।
క్షేత్రస్యకలహంప్రాహుః బంధుశత్రుసమాగమం ॥

తా॥ ప్రశ్నలగ్నము మేషమైతేవ్యవహారభయము, భూవిషయమైన కలహము బంధువులు, శత్రువులు వీర్లసమాగమము కలుగునని చెప్పవలయును.

## వృషభరాశిఫలము.

శ్లో॥ వృషోయదిప్రశ్నలగ్నం స్త్రీమూలంజీవనంతథా ।
చతుష్పాజ్జంతుచింతాచ శుభంప్రశ్నఫలంభవేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నము వృషభమైతేస్త్రీమూలముగజీవనము, చతుష్పాదచింత, శుభ ఫలములు కలుగునని చెప్పవలయును.

## మిథునరాశిఫలము.

శ్లో॥ మిథునంప్రశ్నలగ్నంచే ద్ద్రవ్యంద్వ్యాపారచింతనమ్ ।
మిత్రద్రోహంచలాభంచ బంధువైరంమహద్భయమ్ ॥

తా॥ మిథునము ఆరూఢలగ్నమైతే ఉమ్మడి వ్యాపారచింత, మిత్రద్రోహము, లాభము, బంధువిరోధము, మిక్కిలి భయము ఈచింతయని తెలియవలయును-

## కటకరాశిఫలము.

శ్లో॥ కటకంప్రశ్నలగ్నంచే ద్బంధుదాయాదిమూలకమ్ ।
స్త్రీమూలంవ్యవహారంచ విప్రమూలాద్ధనక్షయమ్ ॥

తా॥ కటకముప్రశ్నలగ్నమైతే బంధువులు, దాయాదులు, స్త్రీవిషయక వ్యవహారము, బ్రాహ్మణమూలముగ ధనక్షయము ఈచింతయని తెలియవలయును-

## సింహరాశిఫలము.

శ్లో॥ సింహోయదిప్రశ్నలగ్నం వ్యవహారస్యచింతనం ।
రాజద్వారేభయంత్రత క్షేత్రమూలాద్ధనక్షయమ్ ॥

తా॥ సింహము ప్రశ్నలగ్నమైతే వ్యవహారము, రాజద్వారభయము, భూమిమూలముగ ధనక్షయము ఈచింతయని తెలియవలయును-

## కన్యారాశిఫలము.

శ్లో॥ కన్యాయదిప్రశ్నలగ్నం స్వకార్యద్రోహచింతనం ।
వ్యత్యస్తగణనంచైవ సవ్యాసవ్యంవినిర్దిశేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నము కన్యఅయితే స్వకార్యద్రోహము, వ్యత్యాసముగ గణనము చేయుట ఒకప్పుడుఅనుకూలముగ, మరియొకపుడు ప్రతికూలముగనుండుట అని తెలిసేది.

## తులారాశిఫలము.

శ్లో॥ తులాలగ్నంయదిప్రశ్నః స్త్రీమూలశుభచింతనం ।
భూమిభూషణలాభస్య చింతేత్యేవంవినిర్ణయః ॥

తా॥ తుల ఆరూఢలగ్నమైతే స్త్రీమూలముగశుభము, భూమి, భూషణములు వీటిచింతయని చెప్పవలయును-

## వృశ్చికరాశిఫలము.

శ్లో॥ వృశ్చికంప్రశ్నలగ్నంచే ద్దేహజాడ్యంమనోవ్యథా ।
దుఃఖంజీవనహానించ నిర్దిశేద్దైవచింతకః ॥

తా॥ వృశ్చికము ప్రశ్నలగ్నమైతే దేహజాడ్యము, మనోవ్యాధి, దుఃఖము, జీవనహాని ఈచింతయని దైవజ్ఞుడు చెప్పవలయును-

ధనురాశిఫలము.

శ్లో॥ ప్రశ్నలగ్నంయదాచాపః బంధుమిత్రవిచింతనం।
ధనచింతాచవకన్యాప్రశ్నకాలేపిసిద్ధదా॥

తా॥ ప్రశ్నలగ్నము ధనుస్సుఅయితే బంధువులు, స్నేహితులు, ధనము వీటి చింతయనియు శీఘ్రముగా కార్యము సిద్ధించుననియు చెప్పవలయును.

మకరరాశిఫలము.

శ్లో॥ ద్రవ్యహానింమనోవ్యాధిం జీవనోపాయమూలకం।
వ్యవహారవిచింతాచ మృగలగ్నే వినిర్దిశేత్॥

తా॥ ప్రశ్నలగ్నము మకరమైతే ద్రవ్యహాని, మనోవ్యాధి, జీవనోపాయము, వ్యవహారము ఈచింతయని చెప్పవలయును.

కుంభరాశిఫలము.

శ్లో॥ మృతినాశ్చోరభయం యాత్రాదేహరుజాభయం।
ప్రశ్నలగ్నేయదికుటః తద్దైవంపరిచింతయేత్॥

తా॥ కుంభము ప్రశ్నలగ్నమైతే మరణాశంకనము, చోరభయము, యాత్ర, రోగభయము, ఈచింతయని చెప్పిరని తా॥

మీనరాశిఫలము.

శ్లో॥ యదిమీనంప్రశ్నలగ్నం ధనధాన్యవిచింతనమ్।
పశుసస్యాదిచింతాచ వక్తివ్యాశాస్త్రవేదిభిః॥

తా॥ మీనముప్రశ్నలగ్నమైతే ధనధాన్యములు, పశువులు, పంటలు మొదలగు చింతలని జ్యోతిశాస్త్రవేత్తలు చెప్పిరని తా॥

ధనస్థానముచే నిర్ణయించతగినవి.

శ్లో॥ మణిర్ముక్తాఫలస్వర్ణం రత్నధాతుకదంబకం
యానాశ్చపణ్యాని ధనస్థానాద్వినిర్ణయః॥

తా॥ మణులు, ముత్యములు, బంగారు, రత్నములు, వెండిమొదలగు ధాతువు వాహనములు వీటిని ధనస్థానమునుపట్టి నిశ్చయింపవలయును.

రవస్థానమునుపట్టి నిర్ణయించతగినవి.

శ్లో॥ నారికాక్షేత్రమిత్రాది గృహారామధనిర్ధీనహా।
వివాహాదిప్రవేశంచ పశ్యేత్సాతా శతోబుధః॥

తా॥ ఉదకము, భూమి, మంత్రాదులు, గ్రహములు, ఔషధములు, వివాహము గృహప్రవేశము, మొదలగువానిని ఆరూఢలగ్నమునకు నాల్గోస్థానమునుపట్టి చెప్పవలెను.

౫ వ స్థానమునుపట్టి నిర్ణయించతగినది

శ్లో॥ గర్భాపత్యాదిసేయానాం సంధిసంధానయోరపి ।
విద్యాబుద్ధిప్రబంధానాం సుతస్థాననిరీక్షణం ॥

తా॥ గర్భము, కొమాళ్లు, మంత్రిము, నానిప్రవర్తనలు, విద్యా, బుద్ధి, గ్రంధములు మొదలగువానిని ఆరూఢరాశి కైదవస్థానమునుపట్టి చూడవలయును-

౬, ౭ వ స్థానములనుపట్టి నిర్ణయించుట

శ్లో॥ నాభీరిపురస్త్రగామ గావోష్ట్రక్రూరకర్మణాం। కూపోదకాదికం తానాం రిపుస్థాననిరీక్షణం । వాణిజ్యంవ్యవహారంచ వివాహంచసమ ఫలైః । గమాగమాంశ్చ క్షేత్రాణి పశ్యేత్సప్తమకస్థలతః ॥

తా॥ నాభి, శత్రువు, ఆమ్లాదిమద్దసరులు, ఆవులు, ఒంటె, క్రూరమైనజంతువులు బావి, ఉదకము వీటిని ఆఱవస్థానమునుపట్టి చెప్పవలయును- వర్తకము, వ్యవహారము, గమనాగమనములు. కార్యసిద్ధి వీటి నేడవస్థానమునుపట్టి చెప్పవలయును-

౮ వ స్థానమునుపట్టి నిర్ణయించుట.

శ్లో॥ ఉత్తరాయణనైషమ్యే దుష్టశాత్రవసంకటే ।
నష్టద్రవ్యేరణేయుద్ధం రంధ్రస్థాననిరీక్షణమ్ ॥

తా॥ ఉత్తరదేశగమనము. దుష్టులైన శత్రుసంకటము, ద్రవ్యనష్టము, యుద్ధము వీటినెనిమిదవ స్థానమునుపట్టి చెప్పవలయును-

౯ వ స్థానమునుపట్టి నిర్ణయించుట.

శ్లో॥ వాపీకూపతటాకాది దేవాలయగృహాణిచ । దీక్షాయాత్రా మఠంధర్మం ధర్మాచ్చింతయేంచకీర్తయేత్ ।

తా॥ నడభావి, బావి, తటాకము, దేవాలయము, గృహము, దీక్ష, యాత్ర, మఠము, ధర్మము, వీటిని తొమ్మిదవస్థానమునుపట్టి చెప్పవలయును,

౧౧ వ స్థానమునుపట్టి నిర్ణయించుట.

శ్లో॥ గజాశ్వయానపాత్రాణి శయ్యాకాంచనకన్యకాః ।
విద్యాద్విద్యోదయేలాభం లాభస్థాననిరీక్షణాత్ ॥

తా॥ ఏనుగు, గుఱ్ఱము, ప్రయాణము, పాత్రలు, పడక, బంగారు, కన్యకలు, విద్య వలన లాభము వీటిని పదనకొండవ స్థానమునుపట్టి చెప్పవలయును-

౧౨ వ స్థానమునుపట్టి నిర్ణయించతగినవి.

శ్లో॥ త్యాగభోగవివాహాదౌ కృష్టంచకృషికర్మసు ।
వ్యయస్థానేనసర్వేషు విద్యావిద్యాంచనిర్ణయః ।

తా॥ త్యాగము, భోగము, వివాహము, కృషి, విద్యా, వీటిని ౧౨ వ స్థానమును పట్టి నిర్ణయించవలయును

ప్రశ్న చక్రము.

| ౯ | ౧౨ | ౭ | ౩౩ |
|---|---|---|---|
| ౨౭ | ౬౦ | ౩౦ | ౧౬ |
| ౧౪ | ౩ | ౫౬ | ౪ |
| ౮ | ౬ | ౫ | ౨ |

శ్లో॥ షోడశారయుతంచక్రం విలిఖ్యచతురశ్రకం । తత్రసంఖ్యాంవిక్షేద్దీమాన్వత్యమాణాన్యథాక్రమం । ద్విపార్కసాగరామర్త్య భవర్షాస్తిథిభూమిపాః। మన్వగ్నిదేశనిగమదిగ్బాస్త్రేంద్రియబాహవః । పృష్టోరిష్టంద్విగుణితం కోష్ఠాంకంభానుసంయుతం । సప్తభిర్భాగమాహృత్య తత్రశిష్టంఫలంభవేత్ । శేషమేకత్రికంవాపి భవేత్కార్యంప్రయాసతః। ద్విచతుష్కయుతంకార్యం అనాయాసేనసిద్ధ్యతి । పంచషష్ఠయుతంవాపి తత్క్షణేనఫలంభవేత్। సప్తసంఖ్యాభవేచ్ఛేషం కార్యహానిశ్చజాయతే॥

తా॥ పృచ్ఛకుని పైప్రశ్న చక్రమునందొక సంఖ్యను తాకమనివానివల్ల తాకబడిన సంఖ్యను రెండింటగుణించి మొత్తముచేసి దానిలో ౧౨ మకూడా కలిపి ౭టభాగహరించి మిగిలిన సంఖ్యచేత ఫలమును చెప్పవలయును- యెట్లనిన—౧-౩ మిగిలితే ప్రయాసచే కార్యసిద్ధియగును- ౨-౪ మిగిలితే అనాయాసముగ కార్యముసిద్ధించును- ౫-౬ మిగిలితే తక్షణమే కార్యమగును- ౭ మిగిలితే కార్యహాని సంభవించును-

## భోజనద్రవ్యాదినిర్ణయము.

శ్లో॥ కథయామి విశేషేణ భుక్తిద్రవ్యస్య నిర్ణయం। పాకభాండాని భుక్తాని వ్యంజనాని రసా స్తథా। సహభోక్తాభోజనాది తథాతత్స్నేహినో రిపూన్। మేషరాశౌ భవేచ్ఛాగం వృషభే గవ్యముచ్యతే। ధనుర్మిథున సింహేషు మత్స్యమాంసాదినిర్ణయః। నక్రాళికర్కిమీనేషు పరిపక్వ ఫలాధికం। తులాకన్యాఘటేష్వన్నం మాంద్యయుక్తపదార్థకం। భానౌ తిక్తకటుక్షారం మిశ్రభోజనముచ్యతే। ఉష్ణాన్నం క్షౌద్రసంయుక్తం భూమిపుత్రస్య భోజనం। భర్జితాన్నం పదంశాది సౌమ్యస్యాహుర్మనీషిణః। పాయసాన్నం ఘృతయుతం గురోర్భోజనమాదిశేత్। సతైలం కోద్రవాన్నం చ భవేన్మందస్య భోజనం। యూషం చ రాహుకేతోశ్చ రసవర్గముదాహృతం। జీవస్య మాషవటకం సూపమిశ్రం తు భోజనం। చంద్రస్యకందప్రసవ మత్స్యాద్యైర్భోజనం భవేత్। క్షౌద్రాపూపపయోదుగ్ధ వ్యంజనం భోజనం భృగోః। ఓజరాశౌ పాపదృష్టే తృష్ణాభోజనముచ్యతే। సమరాశౌ మందదృష్టే భుక్త్యల్పం పాపసేక్షితే। శుభపాపసమాలోకే పురగాన్న క్షుధార్తితః॥ ఆర్కారామాంపభుక్తం స్యా దుగ్ధనాచ్చంద్రభోగినా। నవనీతఘృతక్షీర దధిభిర్భోజనం భవేత్। జలరాశిషు పాపేషు సౌమ్యానామితరేషు చ। సతైలం భోజనం బ్రూయా దిజ్ఞాత్వా విచక్షణః॥

తా॥ భోజనద్రవ్యము, పాకపాత్రములు, శాకములు. అమ్లాదిరసములు కూడా భుజించినవారును, వారిలో శత్రుమిత్రత్వంబులు, వీటిని చెప్పుచున్నాను-ప్రశ్నలగ్నము మేషమైతే మేకసంబంధమైన పాలు, పెరుగు, మొదలైనవి, వృషభమైతే ఆవుసంబంధమైన పెరుగు మొదలైనవి, ధనుస్సు, మిథునము, సింహము ఇవిఅయితే మత్స్యమాంసము మొదలగునవి, మకర, వృశ్చిక, కటక, మీనములైతే పక్వమైనపండ్లు మొదలగునవి, తులా, కన్యా, కుంభములైతే మందకరములైన పదార్థములు భుజింపబడినవని చెప్పవలయును ఆరూఢరాశియందు సూర్యుడుండినకారము, ఉప్పు, చేదు ఈరసములతో గూడియుండు భోజనము, అంగారకుడుండిన కొంచెముష్ణముగ తేనెతో గూడియుండుభోజనము, బుధుడుండిన వేయించబడిన శాకములు మొదలగు భోజనము, గురువుండిన నెయ్యితో గూడిన పాయసాన్న భోజనము, శనియుండిన నువ్వులనూనెతో గూడినవిగ, ఆరికెలు, రాగులు, గోధుమలు మొదలగుభోజనము, రాహుకేతువులుండిన గంజి, రసవర్గభోజనము, మఱియు గురువు బలిష్ఠుడుగనుండిన పప్పు మినుములసంబంధమగు వడలు మొదలగు భోజనము,

చంద్రుఁడుండిన కందమూలఫల మన్నాద్యదిభోజనము, శుక్రుఁడుండిన తేనె భక్ష్యములు, పాలు, పెరుగు, వ్యంజనములువీనితోడ భోజనము అనిచెప్పవలయును ఆరూఢలగ్నము ఓజరాశిగాయుండి శుభగ్రహములచే జూడఁబడిన మిక్కిలిఆకలితో భోజనముచేయఁబడె ననియు, సమరాశిగాయుండి శనిచేజూడఁబడినకొంచముగా భుజింపఁబడెననియును వి షమరాశిని అనేకపాపగ్రహములుచూచిన మిగులఆకలితో చల్లారినఅన్నాదులభుజింపబడెనదనియు, సూర్యుఁడు, అంగారకుఁడు వీరిద్దరుచేరియుండిన ఆకలితో మాంసాదులను భుజింపబడెననియు, శుక్రుఁడు, చంద్రుఁడు, రాహువు వీరలుచేరియుండిన వెన్న, నెయ్యి పాలు, పెరుగు, తేనె, వీనితోడభోజనము అనిచెప్పవలయును ఆరూఢలగ్నము జలరాశి గానుండి పాపశుభగ్రహములు చేరియుండిన నువ్వులనూనెతోచేరినఅన్నము భుజింపబడిన దనిచెప్పవలయును.

## దూతలక్షణము.

శ్లో॥ ఆదిత్యోమూర్ధ్ని దూతస్య సోమశ్చముఖమండలే। కుజఃకంఠే బుధేవామే దక్షిణేదేవపూజితః। హృదయేదైత్యమంత్రీచ బాహ్వోశ్చరవిపుత్రకః। పాదయోరాహుకేతూచ ఇత్యేవందూతలక్షణమ్॥

తా॥ శిరమునందు సూర్యుఁడు, ముఖమునందు చంద్రుఁడు, కంఠమునందు కుజుఁడు, యెడమపార్శ్వమునందు బుధుఁడు, కుడిపార్శ్వమునందు బృహస్పతి, హృదయమందుశుక్రుఁడు, చేతులయందు శని, పాదములయందు రాహుకేతువులు, ఇటులపృచ్ఛకుని అంగములయందు సూర్యాదిగ్రహములను నిశ్చయించి ఆపృచ్ఛకుఁడు తనయేఅంగమును తాకికొనునో ఆయంగమునందలి గ్రహమునుపట్టి లగ్నమును నిశ్చయించుకొనవలెను.

## దేశాంతరస్థప్రశ్న.

శ్లో॥ రౌద్రనక్షత్రమారభ్య యావచ్ఛ్రప్రశ్నతారకా। గణయిత్వాతుతాంసఖ్యాం సప్తభిర్భాగమాహరేత్। దూరస్థితేష్వాగమనం ప్రవదేచ్ఛిష్టసంఖ్యయా। ఏకేనశ్రూయతేవార్తా ద్వితీయేతత్రతిష్ఠతి। తృతీయేమధ్యమార్గేచ చతుర్థేగ్రామాగతః। పంచమేదూరమార్గస్థః షష్ఠేచవ్యాధిపీడితః। సప్తమేమరణంచస్యా దిత్యేతత్ప్రశ్నలక్షణమ్॥

తా॥ పృచ్ఛకుని ౨౭ నక్షత్రములలో నొకనక్షత్రమును చెప్పుమని అతను చెప్పిన నక్షత్రమువఱకు ఆర్ద్రాదిగాయెంచి మొత్తముచేసి ౭ భాగించగా ౧ మిగిలితే దూరదేశమునుండి సమాచారమువచ్చుననియు, ౨ మిగిలితే దేశాంతరముపోయినవారచ్చటనే యున్నారనియు, ౩ మిగిలితే, మార్గమధ్యమునందున్నారనియు, ౪ మిగిలితేగ్రామమునకు

వచ్చినారనియు, ౫ మిగిలితే బహుదూరమార్గమువందున్నారనియు, ౬ మిగిలితే వ్యాధిపీడితులుగనున్నారనియు, ౭ మిగిలితే మరణముజెందినాడనియు, చెప్పవలయును-

శ్లో॥ కృత్తికాంశసమారభ్య యావచ్చప్రశ్నతారకా । గణయిత్వా తుతాంసంఖ్యాం సప్తభిర్భాగమాహరేత్ । తచ్ఛేషేణవదేద్ధీమా నాగమందూరవర్తినః । ఏకస్మిన్నవశిష్టేతు నరస్తత్రైవతిష్ఠతి। ద్వితీయే శీఘ్రమాగచ్ఛే త్తృతీయేమార్గమోన్ముఖః । చతుర్థేసద్యఆగచ్ఛే దాలస్యంపంచమేభవేత్ । షష్ఠేతురోగపీడాస్యా సప్తమేయుత్న సంస్థితః। ఏవంతుసమ్యగాలోచ్య ఫలంబ్రూయాద్విచక్షణః ॥

తా॥ జ్యోతిష్కుడు దూతను ౨౭ నక్షత్రములలో నొకనక్షత్రమును జెప్పుమని యడిగి అతను చెప్పిననక్షత్రమువఱకు కృత్తికానక్షత్రము మొదలు లెక్కించి ఆసంఖ్యను ౭తో విభజించి శేషించినసంఖ్యచే దూరదేశములలోనుండువారి గమనాగమనములను చెప్పగలయును- అదియెట్లనిన ౧ మిగిలినపోయినవాడు ఆదేశములలోనున్నాడనియు ౨ మిగిలిన శీఘ్రముగ వచ్చుననియు, ౩ మిగిలిన ఆస్థలములోనుండి బయలుదేరినాడనియు ౪ మిగిలిన అప్పుడేవచ్చుననియు, ౫ మిగిలిన ఆలస్యముగా వచ్చుననియు, ౬ మిగిలిన రోగపీడితుడుగ నున్నాడనియు, ౭ మిగిలిన వచ్చుటకు ప్రయత్నించుచున్నాడనియు, చెప్పవలయును-

## ఆయుఃప్రశ్న.

శ్లో॥ తిథింవారంచనక్షత్రం యోగంచకరణానిచ । చైత్రాదికాన్ తథామాసాన్ వత్సరాన్ప్రభవాదికాన్ । మేషాదికాన్తథారాశిం తత్కాలాంతంయథాక్రమం । గణయిత్వాతుతాంసఖ్యా మేకీకృత్యవిచక్షణః । సప్తభిర్గుణయిత్వాతాం విభజేచ్ఛతసంఖ్యయా । ఆయుఃప్రమాణకాలంతు ప్రవదేచ్ఛిష్టసంఖ్యయా ।

తా॥ ప్రశ్నఅడిగేకాలమువందు ఏసంవత్సరమో అదివరకు ప్రభవాదిగను, ఏమాసమో దానిని చైత్రాదిగాను, ఏతిథో దానిని ప్రథమాదిగను ఏవారమో దానిని ఆదివారము మొదలుగాను, ఏనక్షత్రమో దానిని అశ్విన్యాదిగను, ఏయోగమో దానినివిష్కంభాదిగను, ఏకరణమో దానిని బవమొదలుగాను, ఏరాశియో దానిని మేషాదిగాను,వీనిని ప్రత్యేకప్రత్యేకముగయెంచిఅన్నిటినియొకటిగాచేర్చి ఆమొత్తమును ఏడింటపెంచిదానిని నూరింటభాగించి శేషించినసంఖ్యయెంతో ఆసంఖ్య ఆయుఃప్రమాణమనిచెప్పవలయును-

## నిధిప్రశ్న.

శ్లో॥ ప్రశ్నలగ్నాద్ద్వితీయంచేద్భవనం దైత్యమంత్రిణః। చంద్రస్యక్షేత్రమథవా తత్రకేంద్రాంశుభాన్వితా। తత్రైవసహితౌస్యాతాం వసుధా తద్గతావసు। తావేవచంద్రభృగుజౌ సహితౌ వీక్షితౌ। వసుధాత్మజరాహుభ్యాం తత్ప్రాప్తిర్నైవవిద్యతే। అథాయాధాచ్చతుర్థంతు భవనంశశినోయది। తత్రాంశేతాంశుధమణౌ వర్తేతేసహితౌతదా। వసుంధరాగతంస్వర్ణం పాపదృష్టౌనసిధ్యతి। ప్రశ్నలగ్నాచ్చతుర్థేతు పాపాఏవగ్రహాస్థితాః। శుభాలోకనహీనాశ్చ పిశాచభయముల్బణం। భవేత్కష్టంచసుమహా త్కదాచిత్సుఖవిభ్రమః। ధనాశయాచపిశాచబాధాయాంతేవిపదోభృశం। ప్రశ్నలగ్నాద్ద్వితీయంచ చతుర్థంవాశినోగృహం। శుక్రస్యక్షేత్రమథవా తత్రచంద్రసితౌయది। గురుణావీక్షితౌపాప సంబంధాలోకవర్జితౌ। స్వచ్ఛస్వర్ణశలాకాశ్చ రత్నానిచవివిధానిచ। ప్రాప్యంతేసర్వథాప్యేవ మీశ్వరేణసమీరితమ్ ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు రెండవయిల్లు శుక్రక్షేత్రముగాగాని చంద్రక్షేత్రముగాగాని అయి ఆ క్షేత్రములలో శుక్రచంద్రులు కూడియుండిన భూమిలోపల ధనముయున్నదని చెప్పవలయును- ఆశుక్రచంద్రులు కుజరాహువులతో గూడియుండినగాని చూడబడినగాని ఆధనము లభించదు- ప్రశ్నలగ్నమునకు నాలవయిల్లు చంద్రక్షేత్రమై అందు గురుచంద్రులు కూడియుండిన నిశ్చయముగా భూమిలో ధనము వున్నదని చెప్పవలయును- అయితే పాపగ్రహముల సంబంధముగాని దృష్టిగాని కలిగియుండిన ధనములభించదు- ప్రశ్నలగ్నమునకు నాలవయింట్లో పాపగ్రహములు మాత్రముయుండి శుభగ్రహదృష్టిలేకయుండిన పిశాచసంబంధమైనభయము, కష్టము ధనమున్నదని విశేషభ్రమ ఆధనాశచే అనేక ఆపత్తులు ఇవి సంభవించును- ప్రశ్నలగ్నమునకు ౨ లేక ౪- స్థానములు చంద్రక్షేత్రముగాగాని శుక్రక్షేత్రముగాగానియుండి వానిలో చంద్రశుక్రులు కూడి ఆస్థానము ఒకరికి ఉచ్చస్థానముగాయుండి గురువుచే చూడబడి పాపసంబంధవీక్షణములు లేకుండిన స్వచ్ఛమైన బంగారుకడ్డీలు అనేకరత్నములు లభించును- ఇటుల ఈశ్వరునిచే చెప్పబడినవి-

## పశుప్రశ్న.

శ్లో॥ ఆయాద్ధేమేషగాశ్చౌతు పూర్వస్యాందిశివర్తతే। వృషభేదక్షిణస్యాంచ వారుణ్యాంమిథునేభవేత్। దశ్యుత్తరస్యాంకటకే చాగ్నే

యోర్యాంసింహచాపయోః । కన్యాయాంమకరేవాపి నైరుత్యాందిశికీర్తితమ్ । కుంభేవాపితులాయాంచ వాయవ్యాందిశిర్దిశేత్ । ఆరూఢే వృశ్చికేమీనే నైశాన్యాందిశికీర్తితమ్ । పశ్వాదీనాంవినష్టానా మేవం స్థానంసమాచరేత్ ॥

తా॥ మేషము ఆరూఢలగ్నమైన కనుపడకపోయిన పశువులు మొదలగు జంతువులు తూర్పుదిక్కున యున్నదనియు, వృషభమైన దక్షిణదిక్కులోయున్నదనియు, మిధునమైన పశ్చిమదిక్కులోవున్నదనియు, కటకమైన ఉత్తరదిక్కులోవున్నదనియు, సింహముగాని, ధనుస్సుగాని అయిన ఆగ్నేయదిక్కులో వున్నదనియు, కన్యగాని మకరముగాని అయితే నైఋతిదిక్కులోవున్నదనియు కుంభముగాని, తులగాని అయితేవాయువు దిక్కునవున్నదనియు, వృశ్చికముగాని, మీనముగాని, అయితే ఈశాన్యదిక్కులో వున్నదనియు చెప్పవలయును-

## చోరప్రశ్ననిర్ణయము.

శ్లో॥ శనిర్వాభూమిజోవాపి ప్రశ్నలగ్నాధిపస్స్వయం ।
తదాచోరహృతద్రవ్య ప్రశ్నమిత్యేవనిర్దిశేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నాధిపతి శనిగాని, అంగారకుడుగాని అయినయెడల ద్రవ్యము దొంగలచే అపహరించబడినదని చెప్పవలెను-

శ్లో॥ ఆరూఢలగ్నాధిపతిస్తృతీయషష్ఠనవమస్థోవ్యయరాశిగోవా ।
యదాభవేజ్జ్యోతిషికస్తదానీం నిర్దిశేచ్చోరహృతార్థప్రశ్నమ్॥

తా॥ ప్రశ్నలగ్నాధిపతి 3 లేక ౬-౯-౧౨ వీనియందుండిన చోరప్రశ్నయని జ్యోతిషికుడు పృచ్ఛకునికి చెప్పవలెను-

శ్లో॥ ఆరూఢాత్సప్తమాధీశః భూమిజోవానినందనః ।
బుతౌత్రియేచరంధ్రేవా ద్వాదశేవాస్థితోయది।
తదాచోరకృతప్రశ్న ఏవమిత్యబ్రవీత్తమ్ ॥

తా॥ ఆరూఢలగ్నమునకు 7 వ యింటివాడు అంగారకుడు, లేకశనిఅయి వీండ్లు, ౬, 3, ౯, ౧౨ ఈస్థానములలోనుండిన చోరప్రశ్నయని చెప్పవలయును-

శ్లో॥ ప్రశ్నలగ్నాత్సప్తమేశః షష్ఠేవాచాష్టమేథవా ।
ద్వాదశేవాతదాచౌర్య ప్రశ్నంతన్నిర్దిశేద్బుధః ॥

తా॥ ఆరూఢలగ్నమునకు సప్తమస్థానాధిపతి ౬ లేక ౯ లేక ౧౨వీనిలోనుండిన అడిగినది చోరప్రశ్నయని చెప్పవలయును-

### చోరవయోనిర్ణయము.

శ్లో॥ కుజజ్ఞౌ బాల్యశిశుశ్చైవ చంద్రశుక్రౌ చ మధ్యమౌ ।
మందమార్తాండదేవేజ్య ఫణినో వృద్ధవిగ్రహాః ॥

తా॥ ఆరూఢలగ్నము అంగారక బుధులయొక్క క్షేత్రములగనుండినను లేక ఆరూఢలగ్నమునందు అంగారకుడుగాని, బుధుడుగాని యుండినను శిశువు (అనగా ౧౬ ఏండ్లవయస్సులోబడినవాడు) చోరత్వము చేసినాడనియు, శుక్రచంద్రులుండిన మధ్యవయస్సుగలవాడు చౌర్యము చేసినవాడనియు, శని, సూర్యుడు, గురువు, రాహువు, వీరల క్షేత్రములగనుండినను, లేక ప్రశ్నలగ్నమునందు వీరలుండినను ౫౦ ఏండ్లకు పైబడినవారు చౌర్యము చేసినారనియు తెలిసికొనవలయును

శ్లో॥ ప్రశ్నలగ్నం కుజబుధ క్షేత్రాశీ యదితత్ర చ । క్రమాత్కుజబుధౌ స్యాతాం ద్వాదశాధికవత్సకః ॥

తా॥ ఆరూఢలగ్నము అంగారక క్షేత్రమై అందు అంగారకుడుండిన లేక బుధక్షేత్రములై అచ్చట బుధుడుండిన చోరుడు ౧౨ సంవత్సరములకు మించిన వయస్సు కలవాడని చెప్పవలయును-

శ్లో॥ ప్రశ్నలగ్నం శశిక్షేత్రం యదితత్రైవ చంద్రమాః । అథవా భార్గవక్షేత్రం తత్రైవ భృగునందనః । మధ్యమాయుస్తదా చోరస్స్యాదితీశ్వరభాషితం । ప్రశ్నలగ్నం రవిక్షేత్రం యదితత్రైవ భాస్కరః । అథవా మందభవనం తత్రసూర్యసుతోయది । అథవా గౌరవం క్షేత్రం తత్ర దేవగురుర్భవేత్ । తదా పంచాశదధిక వయాశ్చోరోథవై ధ్రువ । యస్మిన్ క్షేత్రస్థితో రాహు స్తదీశశ్చోదితం యథా। రాహ్వాధిష్ఠితరాశేశ్చ వయో బ్రూయాత్తథాబుధః ॥

తా॥ ఆరూఢలగ్నము చంద్రక్షేత్రమై అచ్చట చంద్రుడుండినను లేక శుక్రక్షేత్రములై అచట శుక్రుడుండినను చోరుడు ౫౦ సంవత్సరములకు పైబడినవాడని చెప్పవలయును ఆరూఢలగ్నము సూర్యక్షేత్రమై అందు సూర్యుడుండినను శనిక్షేత్రములై అచ్చట శనియుండినను లేక గురుక్షేత్రములై అచట గురువుండినను చోరుడు ౫౦ సంవత్సరములకు పైన ౬౦ సంవత్సరములకులోపలి వయస్సుకలవాడని చెప్పవలయును-

### చోరజాతినిర్ణయము.

శ్లో॥ మేషేతు బ్రాహ్మణశ్చోరః వృషభే క్షత్రియస్తథా । మిథునే వైశ్యకశ్చోరః చోరశ్శూద్రస్తు కర్కటే । సింహేతు బాంధవశ్చోరః కన్యా

యాం శుభరాంగనా। పుత్రో వా సోదరో వాపి తులాయాం తస్కరో భవేత్ । వృశ్చికే భృత్యకశ్చోరః యజమానస్తు కార్ముకే । మకరే మూషికాచోరః పితృభృత్యోథవా భవేత్ । కుంభే తు మాతులశ్చోరః మీనే భూమిగతం భవేత్ । మేషే విప్రో వృషే మ్లేచ్ఛ మిథునే వైశ్యజాతియః । కటకే శూద్రకశ్చోరః సింహే బంధుశ్చ చోరకః కన్యాయాం మాతృజో భార్యా తులాయాం చోర ఇష్యతే । వృశ్చికే మాతులశ్చోరః కార్ముకే గణికో భవేత్ । మకరే మూషకః కుంభే దాసీ మీనే చ నాగతమ్ ॥

తా॥ ప్రశ్నలగ్నము మేషమైతే బ్రాహ్మణుడి మూలముగ, వృషభమైతే క్షత్రియుడి మూలముగ, మిథునమైతే వైశ్యమూలముగ, కటకమైతే శూద్రమూలముగ, సింహమయితే స్వబంధుమూలముగ, కన్యఅయితే స్త్రీమూలముగ, తులఅయితే పుత్రభ్రాతృ మూలముగ, వృశ్చికమయితే నౌకరిమూలముగ, ధనస్సు అయితే యజమాని మూలముగ, మకరమయితే యెలుకల మూలముగ, కుంభమయితే పనికత్తె మూలముగ దొంగతనము జరిగినదనియు, మీనమయితే భూమియందుపడిపోయినదనియు తెలుసుకొనవలయును మఱియు ప్రశ్నలగ్నము వృషభమయితే మ్లేచ్ఛులమూలముగ, సింహమయితే బంధువులమూలముగ కన్యఅయితే పుత్రునిమూలముగ తులఅయితే భార్యమూలముగ, వృశ్చికమయితే, మేనమామమూలముగ, ధనుస్సుఅయితే గణికునిమూలముగ చౌర్యముజరిగినదని కొందరాచార్యులు చెప్పుచున్నారు-

---

చోరుని లక్షణము.

శ్లో॥ ఆననే మస్తకే నాగ్ని నేత్రే వ్రణాకిణాన్వితః । ధైర్యవానుష్ణదేహశ్చ వ్యాయామీ సరసోక్తిమాన్ । చత్వారింశద్వయాచోరః ప్రశ్నలగ్నే ఘటే భవేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నము కుంభమైతే దొంగ ధైర్యవంతుడుగ, ముఖమునందు వ్రణము కలిగి ఆరిపోయినమచ్చగలవాడుగ ఉష్ణశరీరముగలవాడుగ శ్రమకరమైన పనులను చేయువాడుగ, ప్రియమైనమాటలాడువాడుగ, స్త్రీలోలుడుగ, ౪౦ సంవత్సరముల వయస్సుగలవాడుగనుండునని చెప్పవలయును.

శ్లో॥ ప్రశ్నలగ్నం యది వృషః చోరశ్చతురవాగ్భవేత్ । స్వల్పకోపో౽వివేకంచ భీరుశ్శుక్లాంబరప్రియః । కించిద్ధ్రస్వః కుక్కుటాభ కంఠో వలితగాత్రవాన్ ।

తా॥ ప్రశ్నలగ్నము వృషభరాశి అయితే చోరుడు చాతుర్యముతో గూడిన మాటలు, స్వల్పకోపము, వివేకము, ధనము, తెల్లని వస్త్రములయందు ప్రీతి ఇటిగుణములు గలవాడుగ, కొంచెము పొట్టివాడుగ కోడిగంతము వలెనిడుపుగనుండు కంఠముగలవాడుగ, వంగిన శరీరముగలవాడుగనుండును.

శ్లో॥ మిథునం ప్రశ్నలగ్నం చేత్ స్త్రీసమాకారచేష్టితః ।
నాత్యున్నతో నాతినీచః నీలవర్ణస్సువస్త్రధృక్ ॥

తా॥ మిథునము ప్రశ్నలగ్నమైతే చోరుడు, స్త్రీసమానాకారము చేష్టలు గలవాడుగ మిక్కిలిపొడవు, పొట్టిలేనివాడుగ నల్లనివర్ణముగలవాడుగ, మంచివస్త్రములధరించువాడుగనుండును-

శ్లో॥ కటకం ప్రశ్నలగ్నం చే ద్దేవబ్రాహ్మణభక్తిమాన్। స్త్రీషుప్రియ శ్చతురవాఙ్నాతిస్థూలకృశోన్నతః ॥

తా॥ ప్రశ్నలగ్నము కటకమైతే దేవబ్రాహ్మణులయందు భక్తిగలవాడుగ, స్త్రీలయందు ప్రీతిగలవాడుగ, వాక్చాతుర్యముగలవాడుగ, మిక్కిలి స్థౌల్యము, కృశత్వము, పొడవులేనివాడుగ చోరుడుండును-

శ్లో॥ కన్యాలగ్నం యది భవే త్ప్రశ్నలగ్నం తదా నరః । సూక్ష్మబుద్ధి ర్దీర్ఘకేశః విశాలాస్యః ప్రసిద్ధిమాన్। శ్యామవర్ణః సమాంగ శ్శోభంప వంపిధోభవేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నము కన్యయయినచో చోరుడు సూక్ష్మబుద్ధిగలవాడుగ, వెంట్రుకలు నిడివిగానుండువాడుగ, విశాలమయిన ముఖముగలవాడుగ, యశోవంతుడుగ, నలుపువర్ణము, సరియైన అంగములు గలవాడుగనుండును-

శ్లో॥ ప్రశ్నలగ్నం తులా స్యాచ్చే దతిస్థూలశరీరవాన్। అత్యంతారుణవర్ణాంగః స్థైర్యశాలీ భవేన్నరః ॥

తా॥ తుల ఆరూఢలగ్నమయితే చోరుడు అతిస్థూలశరీరముగలవాడుగ, మిక్కిలి ఎఱుపువర్ణముతోగూడిన శరీరముగలవాడుగ, స్థైర్యవంతుడుగనుండునని చెప్పవలయును-

చౌర్యము పురుషుని చే చేయబడినదనుట.

శ్లో॥ ప్రశ్నలగ్నం యది భవే న్మేషసింహాధవృశ్చికః ।
ధనుర్వాపహృతంద్రవ్యం పురుషేణవినిర్దిశేత్ ।

తా॥ మేషము, సింహము, వృశ్చికము, ధనస్సు, వీనిలో నొకటి ఆరూఢలగ్నమైతే పురుషునిచే ద్రవ్యము అపహరించబడినదని చెప్పవలయును.

శ్లో॥ వృషభోమిధునంకన్యా కటకశ్చతులాఘటః । మీనోవామకరోవాపి ప్రశ్నలగ్నంయదాభవేత్ । పురుషేణహృతంపూర్వం స్థాపితంస్త్రీవశేపునః ॥

తా॥ వృషభము, మిధునము, కన్యా, కటకము, తులా, కుంభము, మీనము, మకరము వీనిలో నొకటి ప్రశ్నలగ్నమైతే ప్రథమమునపురుషుడు ద్రవ్యమపహరించి పిదప నాద్రవ్యమును స్త్రీవద్ద ఉంచియున్నాడని, చెప్పవలయును.

## స్త్రీపురుషచోరనిర్ణయము.

శ్లో॥ పుంరాశౌపుంగ్రహేదృష్టే పురుషస్తస్కరోభవేత్ । స్త్రీరాశౌస్త్రీగ్రహేదృష్టే తస్కరీచవధూర్భవేత్ । ఉదయాదోజరాశిస్థేపుంగ్రహేపురుషోభవేత్ । సమరాశ్యుదయేచోరీ సమస్థేస్త్రీగ్రహేభవేత్ ॥

తా॥ ప్రశ్నకాలములో ఉదయరాశిపురుషరాశిగాయుండి దానిని పురుషగ్రహములు చూచినయెడల పురుషుడు దొంగిలించినాడనియు, స్త్రీరాశిగానుండి స్త్రీగ్రహముచూచినయెడల స్త్రీదొంగిలించినదనియు, చెప్పవలయును. మఱియు ఉదయరాశి ఓజరాశిగాయుండి దానిలో పురుషగ్రహముండిన పురుషుడుదొంగిలించినాడనియు,సమరాశిగానుండి దానిలో స్త్రీగ్రహముండిన స్త్రీదొంగిలించినదనియు చెప్పవలయును.

## చోరహృతభూషణాదివివరము

శ్లో॥ ఆరూఢరాశిర్మేషోవా వృశ్చికోవాయదాభవేత్ । సింహోవాచాపమీనౌవా కంఠాభరణమాదిశేత్ । కన్యావామిధునంవాపి చాంద్రంకర్కటమేవవా । తదాచోరహృతంకర్ణ భూషణంమతిమాన్వదేత్ । వృషభతులావారూఢో యదితుభవేచ్ఛిరోభూషాం। బాహూర్వోరాభరణంబ్రూయా దారూఢోమకరకుంభకౌన్యాతాం । రాహుర్వాయదివాకేతుః ప్రశ్నలగ్నస్థితోభవేత ।చోరేణాపహృతంబ్రూయాచ్చరణాభరణంబుధః ॥

తా॥ మేషము, లేకవృశ్చికము, లేకసింహము, లేకధనుర్మీనములు ఇవి ఆరూఢలగ్నములైనయెడల పోయినసొమ్ము కంఠాభరణమనియు, కన్యామిథున, సింహ, కటకములలో నేదైనా నొకటి ఆరూఢలగ్నమైతే చెవిలోధరించునట్టిసొమ్ము పోయినదనియు

వృషభముగాని తులగాని ఆరూఢలగ్నమైనయెడల శిరోభూషణము పోయినదనియు, మకరముగాని, కుంభముగాని, ఆరూఢలగ్నమైతే చేతులోధరించుభూషణము పోయినదనియు, రాహువుగాని, కేతువుగాని, ఆరూఢలగ్నమునందుండినయెడల కాళ్లయందు ధరించుసొమ్ము పోయినదనియు, తెలుసుకొనవలయును.

### చౌర్యద్రవ్యస్వరూపము.

శ్లో॥ ప్రశ్నలగ్నంరవిక్షేత్రం కుజక్షేత్రమథాపివా ।
తదాచోరహృతంద్రవ్యం సాశ్రికంచవినిర్దిశేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నము సూర్యక్షేత్రముగా లేక అంగారకక్షేత్రముగానుండినదొంగలచే నపహరింపబడినసొమ్ము కోణములతోగూడియుండు నని చెప్పవలయును.

శ్లో॥ చంద్రస్యభవనంస్యాచ్చే త్సరంధ్రంవస్తునిర్దిశేత్ । యదాశుక్రస్యభవనం శకలైర్యుక్తమాదిశేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నము చంద్రక్షేత్రమై యుండిన ద్వారముతోగూడిన సొమ్మనియు, శుక్రక్షేత్రమయియుండిన తునకలు తునకలుగానుండు సొమ్మనియు చెప్పవలయును.

శ్లో॥ బుధస్యవాగురోర్వాపి భవనంవర్తులంభవేత్ ।
శనిక్షేత్రంప్రశ్నలగ్నం భవేచ్చేద్దీర్ఘమాదిశేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నము, బుధుడు, లేకగురువు,వీరి క్షేత్రమయియుండినగుండ్రముగానుండుసొమ్మనియు, శనిక్షేత్రముగానుండిన నిడివిగానుండుసొమ్మనియు చెప్పవలయును.

### చోరద్రవ్యమునుండుస్థానము.

శ్లో॥ ఆరూఢలగ్నాధిపతి ర్యదిస్వక్షేత్రమాశ్రితః। తదావినష్టంతద్ద్రవ్యం స్వగృహస్థితమాదిశేత్ । ప్రశ్నలగ్నాధిపోన్యస్య క్షేత్రంయదిసమాశ్రితః । అన్యగేహస్థితంద్రవ్య మాదిశేద్దైవచింతకః ॥

తా॥ ఆరూఢలగ్నాధిపతి స్వక్షేత్రములోనుండిన పోయినసొమ్ము తనగృహములోనేయున్నదనియు, ప్రశ్నలగ్నాధిపతి యితరక్షేత్రములలోనుండిన పోయినసొమ్ము యితరగృహములలో యున్నదనియు చెప్పవలయును-

### చౌర్యద్రవ్యస్థానము.

శ్లో॥ శుక్రేచంద్రేజలాధారే దేవతాయతనేగురౌ ।
రవౌచతుష్పదస్థానే మిత్రస్యభవనేబుధే ॥

తా॥ ప్రశ్నలగ్నమును శుక్రగ్రహము చూచినను లేక వారచ్చటనుండినను, తటాకమందున్నను, గురువు చూచిన లేక దానియందుండిన దేవాలయమునందును, సూర్యుడు చూచిన లేక దానియందుండిన నాలుగుత్రోవలు కలసినస్థానమునందును, బుధుడు చూచిన లేక దానియందుండిన స్నేహితునింటియందును నష్టద్రవ్యమున్నదని చెప్పవలయును-

శ్లో॥ ప్రశ్నలగ్నం రవిక్షేత్రం యది వాత్ర భాస్కరః । చంద్రస్య క్షేత్రమథవా యది తత్రైవ చంద్రమాః । తదా చోరహృతద్రవ్యం రాజస్థానగతం వదేత్ । కుజస్య క్షేత్రమథవా కుజో వాతత్ర వర్తతే । తథా చోరహృతద్రవ్యం స్వర్ణకారసమీపగం । బుధస్య క్షేత్రమథవా యది తత్రైవ సోమజః । తదా వినిర్దిశేద్ద్రవ్యం బ్రాహ్మణస్యవ శేషితం । గురోః క్షేత్రం ప్రశ్నలగ్నం తత్ర వా దేవపూజితః । తదా వినష్టం తద్ద్రవ్యం సంకరాణాం వశంగతం। ప్రశ్నలగ్నం భార్గవస్య క్షేత్రం తత్రైవ భార్గవః। తదా హృతం తద్ద్రవ్యం చ వైశ్యానాం స్థగతం భవేత్ । మందక్షేత్రం ప్రశ్నలగ్నమథ వాత్ర సూర్యజః । తదా శూద్రహృతం బ్రూయా ద్ద్రవ్యం నష్టం విచక్షణః ॥

తా॥ ఆరూఢలగ్నము సూర్యక్షేత్రముగనుండి అందులో సూర్యుడుండినను లేక చంద్రక్షేత్రమయి అందులో చంద్రుడుండినను చోరులచే దొంగిలింపబడిన ద్రవ్యము రాజస్థానములలో నున్నదని తెలుగవలయును ఆరూఢలగ్నము అంగారకక్షేత్రములై అందులో అంగారకుడుండిన నష్టమయినద్రవ్యము కంసాలవాని యింటిలో నున్నదని తెలియవలయును ఆరూఢరాశి బుధక్షేత్రములై అచ్చట బుధుడుండిన బ్రాహ్మణసమీపమందున్నదని చెప్పవలెను ఆరూఢరాశి గురుక్షేత్రములై అందులో గురువుండిన నష్టద్రవ్యము సంకరజాతిలో చేరియున్నదని చెప్పవలయును ప్రశ్నలగ్నము శుక్రక్షేత్రములై అందులో శుక్రుడుండిన దొంగలించినసొమ్ము కోమటివారి ఆధీనంబుగనున్నదియని చెప్పవలయును ఆరూఢలగ్నము శనిక్షేత్రములై అందులో శనియుండిన నష్టద్రవ్యము శూద్రునిచే నపహరింపబడినదని తెలియవలెను.

## చౌర్యముంచు దిక్కు.

శ్లో॥ ప్రశ్నలగ్నాత్ప్రథమేశః దిశో యస్యాస్త్వధీశితా । అథవా దశమాధీశో యస్యాం దిశి చ వర్తతే । తస్యాం దిశి స్థితం ద్రవ్యం వదేజ్జ్యోతిషికోత్తమః ॥

తా॥ ఆరూఢలగ్నమునకు సప్తమస్థానాధిపతి యేదిక్కునకు అధిపతికి నుండునో లేక ప్రశ్నలగ్నమునకు ౧౦ వ స్థానాధిపతి యేదిక్కులోనుండునో ఆదిక్కునందు నష్ట ద్రవ్యమున్నదని తెలియవలెను.

### పోయినసొమ్ములభించదనుట

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపఃపాపః స్వయంపాపైశ్చసంయుతః ।
శుభవీక్షణసంబాధ రహితస్తన్నసిద్ధ్యతి ।

తా॥ ప్రశ్నలగ్నాధిపతి స్వయంపాపిఅయి పాపగ్రహములతోగూడి శుభగ్రహ సంబంధము లేకుండిన పోయినసొమ్ము సిద్ధించదు.

శ్లో॥ ఆరూఢలగ్నంగురుణాభృగుణాపినవీక్షితం ।
యదిపాపైర్యుతంనష్టం తద్ద్రవ్యంనైవసిద్ధ్యతి ।

తా॥ ఆరూఢలగ్నము గురుశుక్రులచే చూడబడక పాపగ్రహములతోగూడియుండినపోయినసొమ్ము నిశ్చయముగాదొరకదు.

### పోయినసొమ్ముదొరుకుననుట

శ్లో॥ ప్రశ్నలగ్నాధిపఃపాపః శుభైర్యుక్తోథవీక్షితః ।
తదాచోరహృతంద్రవ్యం తత్క్షణాదేవసిద్ధ్యతి ।

తా॥ ప్రశ్నలగ్నాధిపతి పాపిగానుండినను వాడు శుభులతోగూడిగాని లేక శుభులచే చూడబడిగానియుండిన చోరత్వముపోయిన ద్రవ్యము తత్క్షణముదొరుకును.

### చౌర్యద్రవ్యముదూరసమీపములయందున్నదనుట.

శ్లో॥ ప్రశ్నాక్షరంషడ్గుణితం రవిసఖ్యాసమాయుతం । అష్టభిర్భాగమాహృత్య గ్రహాణాంఫలమాదిశేత్ । భౌమార్కయోశ్చ వేద్దూరే సమీపేబుధచంద్రయోః । మార్గేభార్గవగుర్వోశ్చ శనిరాహ్వోర్నదృశ్యతే ।

తా॥ ప్రశ్నాక్షరములను ఆరింటపెంచి ఆసంఖ్యతో ౧౨ చేర్చి ౮ చే భాగించి మిగిలినసంఖ్యలో ౧ అయితే సూర్యుడు ౨ అయితే చంద్రుడు ఇటుల గ్రహములనునిశ్చయించుకొని సూర్యాంగారకులయితే సొమ్ముదూరములోనున్నదనియు. బుధచంద్రులయితే సమీపములోనున్నదనియు, గురుశుక్రులయితే మార్గములోనున్నదనియు, శనిరాహువులయితే దొరకదనియు చెప్పవలయును. ఇటులనే జీవప్రశ్నలోను చెప్పవలయును.

## నష్టద్రవ్యచింత.

శ్లో॥ రాహుర్వారవిసూనుర్వారవిర్వాభూమిజోపి వా। లగ్నత్రికంచ సప్తస్థాః నష్టద్రవ్యంచసిద్ధ్యతి ॥

తా॥ ఆరూఢలగ్నము దానికి ౩, ౫, ౭ వీనియందు రాహువుగాని, శనిగాని, సూర్యుడుగాని, అంగారకుడుగాని వుండినయెడల నష్టద్రవ్యము సిద్ధించును.

శ్లో॥ తిథింవారంచ నక్షత్రం లగ్నసంయుక్తమేవచ । పంచభిర్భాగమాహృత్య నష్టద్రవ్యంవిచింతయేత్ । పృథివ్యామాదిభూతేషు జలేషుజలరోధసి । తేజోమనుష్యహస్తేషు వాయువ్యాంగృహమాదిశేత్ । ఆకాశోపరిభాగేచ నష్టద్రవ్యంనసిద్ధ్యతి ।

తా॥ ప్రశ్నకాలమునందు తిథి, వారము, నక్షత్రము, లగ్నము వీనిసంఖ్యను ఒకటిగాచేర్చి అయిదింటభాగించగా ౧ మిగిలితే పృథివియందును, ౨ మిగిలితే ఉదకముయందును, ౩ మిగిలితే మనుష్యునియందును, ౪ మిగిలితే గృహమునందును నష్టద్రవ్యమున్నదని తెలుసుకొనవలయును. ౫ మిగిలితే నష్టద్రవ్యముదొరకదు-

## నష్టద్రవ్యముపలానిదనుట.

శ్లో॥ బృహస్పత్యుదయేస్వర్ణం నష్టంనాస్తీతినిర్దిశేత్ । శుక్రేచతుర్థకేరౌప్యంచ నష్టంభవతిధ్రువం । సీసంకుజేసప్తమస్థే శనౌలోహం నజాయతే। బుధోదయేత్రిపుఃప్రాయం నష్టంచంద్రేచతుర్థగే । కాంస్యం నష్టంనభవతి అంగనాచైవసప్తమే । ఆరకూటంపంచమస్థే భానౌనష్టం నజాయతే ॥

తా॥ ప్రశ్నకాలములో బృహస్పతి ఉదయరాశియందుండిన పోయినవస్తువుస్వర్ణమనియు అది దొరుకుననియు, శుక్రుడు ౪వ స్థానమునందుండిన వెండిపోయినదనియు, అది దొరకదనియు, కుజుడు ౭వ స్థానమునందుండిన సీసముపోయినదనియు, అది దొరకదనియు, శని ౭ వ యింటనుండిన లోహముపోయినదనియు, అదిదొరకదనియు, ౭వ యింట బుధుడుండినత్రిపు (అనగాసీససంబంధమైనవస్తువు) పోయినదనియు, అదిదొరకదనియు, చంద్రుడు ౪ వ యింటనుండిన కంచుపోయినదనియు, అది దొరకదనియు, చంద్రుడు ౭వయింటనుండిన స్త్రీపోయినదనియు అదిదొరకదనియు, సూర్యుడు౫వయింటనుండిన విత్తడిపోయినదనియు, అదిదొరకదనియు, చెప్పవలయును-

శ్లో॥ దశమేపాపసంయుక్తే నష్టాశ్చైవచతుష్పదః। చతుష్పాదుదయే రాహౌ స్థితంనష్టశ్చతుష్పదాం । బాధకస్థాధిపేయుక్తే తత్ద్విపదరా

శయః । బహుపాదుదయే రాహౌ బహుపాన్నష్టమాదిశేత్ । పక్షిరా
శౌ తథా నష్టం మే శేషాబంధసంభవేత్ ।

తా॥ ఆరూఢలగ్నమునకు ౧౦వ యింటిలో పాపగ్రహములు చేరియుండిన చతు
ష్పాదజంతువు పోయినదని చెప్పవలయును- ఆపదవయిల్లు చతుష్పాదరాశిగానుండి దానిలో
రాహువు యుండిన చతుష్పాదజంతువు పోయినదనియు, అది దొరుకుననియు, చెప్పవల
యును- ఆపదవయిల్లు ద్విపాదరాశిగానుండిన మనుష్యులు కనబడలేదని చెప్పవలయును-
ఆపదవయిల్లు బహుపాదరాశిగానుండి దానిలో రాహువు యుండిన బహుపాదిజంతువు
లుపోయినదనియు అవి దొరకదనియు చెప్పవలయును ఆపదవయిల్లు పక్షిరాశిగా నుండిన
పక్షులుపోయినదనియు చెప్పవలయును-

## నష్టద్రవ్యముండుస్థలము.

శ్లో॥ కర్కివృశ్చికయోర్లగ్నే స్వగృహే నష్టమాదిశేత్ ।
మృగమీనోదయే నష్టం కపోతాంతరయోర్వదేత్ ।

తా॥ ప్రశ్నకాలమునందు కటకము వృశ్చికము ఇవి వుదయమయిన నష్టమయిన
సొమ్ము తనయింటిలోనే వున్నదనియు, మకరమీనరాసులు ఉదయమయిన తన యింటిసం
దులు బొక్కలు వీనిలో యున్నదనియు చెప్పవలయును-

శ్లో॥ కలశే భూమిజే సౌమ్యే ఘటే రిక్తఖగే గురౌ । శుక్రే చకరకే
భగ్నఘటే భాస్కరనందనే। ఆవాళమటే భానౌ చంద్రే లవణభాండకే।
నష్టద్రవ్యాశ్రితం స్థానం సముద్రితిసందిశేత్ ॥

తా॥ ప్రశ్నకాలములో ఉదయరాశియందు అంగారకుడుండిన పోయినసొమ్ము
దొంతికుండలో యున్నదనియు గురువుండిన కొత్తకుండలోయున్నదనియు, శుక్రు
డుండిన గరికపిడతలోనున్నదనియు, శనియుండిన వోటికుండలోయున్నదనియు సూర్యు
డుండిన కుడితికుండలో యున్నదనియు, చంద్రుడుండిన ఉప్పుకుండలో యున్నదనియు
చెప్పవలయును-

## నష్టద్రవ్యసిద్ధి వివరము.

శ్లో॥ కర్కినక్రపురంధ్రీషు నష్టద్రవ్యం సిధ్యతి ।
జీవం వినాపరఖగే సప్తమస్థే న సిద్ధ్యతి ।

తా॥ ప్రశ్నకాలములో కటకము, మకరము, కన్య ఇవి వుదయించిన నష్టద్రవ్యము
దొరకదు మరియు ప్రశ్నలగ్నమునకు ౧౦వ యింట్లో గురువు తప్ప నేగ్రహములుండి
నను నష్టద్రవ్యము దొరకదు.

## చతుష్పదాది జీవచింత.

శ్లో॥ మేషరాశౌస్థితే భౌమే మేషమాహుర్మనీషిణః । తస్మిన్నర్కే స్థితేవ్యాఘ్రం గోలాంగూలో బుధేస్థితే । శుక్రేగౌః వృషభశ్చంద్రే గురావశ్వం తతఃపరం । మహిషీ సూర్యతనయో రాహౌ గవయ ఉచ్యతే ॥

తా॥ ఆరూఢకాలమునందు మేషరాశిలో అంగారకుడుండిన మేక, సూర్యుడుండినవ్యాఘ్రము, బుధుడుండిన కొండముచ్చు, శుక్రుడుండిన వృషభము, గురువుండిన గుఱ్ఱము, శని రాహువులుండిన ఎనుము అని చెప్పవలయును-

## ఆరూఢ విషయము.

శ్లో॥ ఉదయాద్రిత్రికాధీశే ఖేటాఢ్యే పశ్యన్శుభైర్యది। చింతితార్థాగమంచైవ స్త్రీలాభో రాజ్యసిద్ధదః ॥

తా॥ ఆరూఢరాశికి 3 వ రాశ్యధిపతి ఉచ్చుడుగాయుండి శుభులచే చూడబడి నచింతించిన కార్యమనుకూలమగును దేశాంతరముపోయినవారు వత్తురు స్త్రీలాభముకలుగును రాజ్యప్రాప్తియు కలుగును.

శ్లో॥ ఉదయంచంద్రలగ్నంచ రిపుఃపశ్యతినాయుతః। ఆయుస్థానేఃరిపుస్థానగతశ్చేద్బంధనం ప్రజేత్ । రోగీనయదినష్టశ్చేద్బహిర్గవతేంప్రదత్ ॥

తా॥ ఆరూఢలగ్నమునందుగాని చంద్రలగ్నమునందుగాని క్రూరగ్రహము లుండినను లేక వానిని క్రూరగ్రహములు చూచినను రోగిజీవించడు కారాగృహమునందుండువాడు విముక్తుడుకాడు యిచ్చినసొమ్ము రాదు, నష్టద్రవ్యము గానరాదు.

శ్లో॥ బలవన్తౌ చంద్రజీవాభ్యాం కేంద్రేషు సహితేషుచ । నష్టప్రశ్నేన నష్టంస్యాన్మృత్యుప్రశ్నేననశ్యతి । పాపదృష్టియుతే కేంద్రే బ్రూయాత్తస్యవిపర్యయం ॥

తా॥ ఆరూఢమునకు కేంద్రస్థానమునందు గురుచంద్రులు బలవంతులుగ నుండిన నష్టప్రశ్న అయినయెడల నష్టద్రవ్యమువచ్చుననియు, మరణప్రశ్న అయినయెడల రోగిజీవించుననియు, చెప్పవలయును కేంద్రస్థానములయందు పాపగ్రహము లుండినను లేక ఆస్థానములను పాపగ్రహములు చూచినను పైకార్యములు చెడిపోవునుఅని చెప్పవలెను-

శ్లో॥ చంద్రవ్యోమ్నిస్థితేశుక్రే జీవాద్వ్యోమ్నిస్థితేరవౌ । తల్లగ్నే కార్యసిద్ధిస్స్యాత్పృచ్ఛతాంనాత్రసంశయః । ఉదయాత్సప్తమేవ్యోమ్ని శుక్రశ్చేత్ స్త్రీసమాగమః । ధనాగమంచసౌఖ్యంచ చంద్రేప్యేవంప్రకీర్తితమ్ ।

తా॥ ప్రశ్న అడిగే కాలమునందు చంద్రునికి ౧౦ వ యింట శుక్రుడుండినను, గురువుకు ౧౦ వ యింట సూర్యుడుండినను నిస్సంశయముగ కార్యము సిద్ధించుననిచెప్ప వలయును మఱియు ఆరూఢలగ్నమునకు ౭ వయింటగాని ౧౦వయింటగాని శుక్రుడుండిన స్త్రీసమాగమములభించుననియు, చంద్రుడుండిన ధనలాభము, సౌఖ్యము కలుగుననియు చెప్పవలయును-

శ్లో॥ మిత్రస్యాత్యుచ్చమాయాంతి యదిఖేటా స్త్వరిష్టదాః ।
నీచారిమౌఢ్యమాపన్నాః సర్వకార్యవినాశనాః ॥

తా॥ ప్రశ్న కాలమునందు శుభగ్రహములు మిత్ర ఉచ్చస్వక్షేత్రములయందుండి నఅడిగినకార్యము నిశ్చయముగ నగుననియు నీచములుగ, మౌఢ్యమును జెందినవారుగ, శత్రు స్థానగతులుగనుండిన అడిగినకార్యము కానేరదనియు చెప్పవలయును-

## వివాహప్రశ్న.

శ్లో॥ ప్రశ్నే వైవాహికే లగ్నే కుజసూర్యబుధాయది । వైధవ్యం శీఘ్రమాయాది సానారీనాత్రసంశయః॥ ఉదయేమందగే నారీ రిక్తామృత సుతాభవేత్ । చంద్రోదయేతు మరణందంపత్యోశ్శీఘ్రమేవచ । చంద్ర జీవబుధాః లగ్నే యదితౌదీర్ఘజీవినౌ ॥

తా॥ వివాహప్రశ్న కాలమునందు లగ్నములో కుజ రవి బుధులుండినను లేక ఆలగ్న మును కుజ బుధ సూర్యులుచూచినను ఆస్త్రీ వైధవ్యమును జెందును. మఱియు నారూఢ లగ్నమునందు శనియుండిన ఆస్త్రీ దరిద్రముగలదిగ, మృతసంతానముకలదిగనగునుచంద్రు డుండిన దంపతులిరువురకు మరణము కలుగును చంద్రగురుబుధులుండిన స్త్రీపురుషులు దీర్ఘాయుస్సు గలవారుగ నుందురు-

శ్లో॥ ద్వితీయ్యేధనిశానాథే బహుపుత్రవతీభవేత్ । స్థితాయద్యర్క మందారా మానక్లేశాదరిద్రతా । ద్వితీయ్యేరాహుసంయుక్తే సాభా ర్యాదుష్టచారిణీ శుభగ్రహాద్వితీయ్యస్థాః మంగళాయుష్యవృద్ధిదాః ॥

తా॥ ఆరూఢలగ్నమునకు రెండవరాశియందు చంద్రుడుండిన నాస్త్రీకి అనేకపు త్రులుజనింతురు సూర్యశన్యంగారకులుండినమానహాని దరిద్రముకలుగును రాహువుం డినది దుష్టనడతలుగలదిగనుండును శుభగ్రహములుండినదీర్ఘసుమంగలిగ, దీర్ఘాయుస్సు గలదిగనుండును అనిచెప్పవలయును.

శ్లో॥ తృతీయేజీవరాహూచే త్సావంధ్యాభవతిధ్రువమ్ ।
అన్యేతృతీయరాశిస్థాః ధనసౌభాగ్యవృద్ధిదాః ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు 3 వ యింట శని రాహువులుండిన ఆ స్త్రీ గొడ్రాలగును- ఇతరగ్రహములుండిన ధనము సౌభాగ్యము వృద్ధియగును.

శ్లో॥ చతుర్థేర్కనిశానాథౌ తిష్ఠతో యదిపాపినీ। శనిశ్చేత్ స్తన్యహీనా స్యాదహినా స్సపత్న్యవత్యసా।బుధజీవారశుక్రాశ్చేదల్పజీవనవత్యసా॥

తా॥ ప్రశ్నలగ్నమునకు 4 వ యింటిలో సూర్యచంద్రులుండిన ఆ స్త్రీ పాపిష్ఠిగను, శనియుండిన స్తనములు లేనిదిగను, రాహువుండిన సవతిగలదిగను, బుధ, గురు, అంగారకులుండిన స్వల్పసౌఖ్యములో గూడినదిగనుండును.

శ్లో॥ పంచమేయదిసౌరస్స్యా ద్వ్యాధిసంపీడితాభవేత్ । చంద్రాదిత్యౌతువంధ్యాస్యా దహిశ్చేన్మరణంభవేత్। ఆరశ్చేత్పుత్రనాశస్స్యాత్ప్రశ్నేపాణిగ్రహోచితే । శుక్రజీవబుధాస్స్యుశ్చే ద్బహుపుత్రవతీభవేత్ ॥

తా॥ వివాహప్రశ్నకాలమునందు ప్రశ్నలగ్నానికి 5వ యింటిలో శనియుండిన ఆ స్త్రీ వ్యాధిపీడితగ, సూర్యచంద్రులుండిన గొడ్రాలుగ నగును- రాహువుండిన శీఘ్రముగా మరణమును జెందును- అంగారకుడుండిన పుత్రనాశముకలుగును- శుక్రబుధగురులుండిన అనేకపుత్రులుగలదిగనగును-

శ్లో॥ షష్ఠేశశీచేద్విధవా బుధఃకలహకారిణీ । షష్ఠేతిష్ఠతిశుక్రశ్చే ద్దీర్ఘమాంగల్యధారిణీ । అన్యేతిష్ఠంతిచేన్నారీ సుఖినీవృద్ధిమత్యపి ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు 6వ యింటిలో చంద్రుడుండిన ఆ స్త్రీ విధవరాలగును బుధుడుండిన కలహకారిగ, శుక్రుడుండిన దీర్ఘసుమంగలిగ, ఇతరగ్రహములుండిన సుఖము పుత్రపౌత్రాభివృద్ధిగలదిగనుండును-

శ్లో॥ సప్తమస్థేశనౌనారీ తరసావిపతిర్భవేత్ । వ్యాధిగ్రస్తాభవేన్నారీ సప్తమస్థేరవౌయది । పరేణాపహృతాయాతి కుజేతిష్ఠతిసప్తమే। సప్తమస్థేనిశానాథే జ్వరపీడావతీభవేత్ । బుధజీవౌసమృద్ధిస్స్యా ద్రాహుశ్చేద్విధవాభవేత్ । శుక్రశ్చేత్పుత్రసిద్ధిస్స్యా ద్భర్తుర్మృత్యుం ప్రయాస్యతి ॥

తా॥ ప్రశ్నలగ్నమున ఏడవయింటిలో శనియుండిన ఆ స్త్రీ త్వరలో విధవరాలుగ నగును- సూర్యుడుండిన వ్యాధిపీడితయగును- అంగారకుడుండిన పరపురుషునితో పోవును. చంద్రుడుండిన జ్వరముచే పీడింపబడును- బుధగురులుండిన విశేషసంపత్తుగలదిగ నుండును

రాహువుపుండిన వైధవ్యమును జెందును- శుక్రుడుండిన పుత్రవతిగ, భర్తమును పే మరణమును జెందునదిగనగును.

శ్లో॥ అష్టమస్థాశ్శుక్రగురు భుజంగానాశయంతిచ । శనిజ్ఞౌవృద్ధిదా ఛంద్రో మారయత్యేవభామినీం । ఆదిత్యారాపునర్భ్యాన్య ప్రశ్నే వైధవ్యమాదిశేత్ ॥

తా॥ ప్రశ్నలగ్నమున కెనిమిదవయింటిలో శుక్రుడు, గురువు, రాహువు, చంద్రుడువుండిన ఆస్త్రీశీఘ్రముగ మరణము జెందును- శనిగాని బుధుడుగానియుండిన సంపత్తు గలదిగనుండును- సూర్యాంగారకులుండిన పునర్వివాహముచేసికొనును- వైధవ్యమును కూడాజెందును -

శ్లో॥ నవమేయదిసౌమ్యస్స్యా ద్వ్యాధిహీనాభవేద్వధూః ।
అన్యేతిష్ఠంతినవమే యదివంధ్యానసంశయః ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు తొమ్మిదవయింట్లో బుధుడుండిన ఆస్త్రీవ్యాధిలేనిదిగ। గురుచంద్రులుండిన బహుపుత్రవతిగనగును- యితర గ్రహములుండిన గొడ్రాలుగనగును।

శ్లో॥ దశమేయదిచంద్రస్యా ద్వంధ్యాభవతిభామినీ । భార్గవేయది వేశ్యాస్యా ద్విధవార్కి-కుజావుభౌ । రిక్తాగురుశ్చేత్ జ్ఞాదిత్యోయదిత స్యాశ్శుభంభవేత్ ।

తా॥ ప్రశ్నలగ్నమునకు ౧౦వ యింట్లో చంద్రుడుండిన ఆస్త్రీగొడ్రాలుగ శుక్రుడుండిన వేశ్యగ, శన్యంగారకులుండిన విధవగ, గురువుండిన దరిద్రురాలుగనగును- బుధ సూర్యులుండిన శుభముకలుగును.

శ్లో॥ లాభస్థానగతాస్సర్వే పుత్రస్సౌభాగ్యవృద్ధిదాః । లగ్నద్వాద శగేచంద్రే యదిస్యాన్నాశమాదిశేత్ । శనిభౌమౌయదిస్యాతాం సురా పానవతీభవేత్ । బుధఃపుత్రవతీజీవో ధనధాన్యవతీవధూః । సర్వాదిత్యౌ స్థితౌవంధ్యా శుక్రస్సుఖవతీభవేత్ ।

తా॥ వివాహప్రశ్నకాలమునందు ౧౧ వ యింట్లో ఏగ్రహముండినను సంపత్సౌ భాగ్యములు కలుగును ౧౨ వ యింట్లో చంద్రుడుండిన ఆస్త్రీమరణమును జెందును శన్యం గారకులుండిన ఆస్త్రీకల్లుత్రాగును బుధుడుండిన పుత్రవతిగ, గురువుండిన ధనధాన్య సంపత్తుగలదిగ రాహుసూర్యులుండిన గొడ్రాలుగ, శుక్రుడుండినసుఖవంతురాలని తా॥

## గర్భప్రశ్న.

శ్లో॥ పుత్రోత్పత్తినిమిత్తంయత్ ప్రశ్నేస్త్రీభిఃకృతేసతి । ఉదయారూఢలగ్నేషు రాహుశ్చేద్గర్భమాదిశేత్। లగ్నాద్వాచంద్రలగ్నాద్వా త్రికోణేసప్తమేపివా బృహస్పతిస్థితోవాపి యదిపశ్యతిగర్భిణీ ॥

తా॥ గర్భపరిశ్న అడుగు కాలములో ఆరూఢలగ్నమునందుగాని ఉదయలగ్నము నందుగాని రాహువుండిన గర్భముధరించినదని చెప్పవలయును ప్రశ్నలగ్నము చంద్రలగ్నమువీనికి త్రికోణమునందుగాని, ౭ వ యింటగాని గురువుండినను లేక పైత్రికోణ సప్తమములను గురువుచూచినను గర్భముధరించియున్నదని చెప్పవలయును.

శ్లో॥ శుభవర్గేణయుక్తశ్చేత్ సుఖప్రసవమాదిశేత్। అరినీచగృహస్థశ్చే త్సుతారిష్టంభవిష్యతి ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు త్రికోణమునందును, లేక చంద్రలగ్నమునకు ఏడవయింటి యందును గురువు శుభాంశమును పొందియుండిన గర్భిణి సుఖముగ ప్రసవించుననియు, ఆగురువు నీచశత్రుగృహములలోనుండిన ఆశిశువునకు అరిష్టము గలదనియు చెప్పవలయును.

శ్లో॥ లగ్నాత్త్రినవద్యూనేషు శుక్రాదిత్యేందవఃక్రమాత్ ।
తిష్ఠంతిచేన్నగర్భస్స్యా దేకత్రైతేస్థితాయది ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు 3, ౫, ౯, యీయిండ్లలో శుక్రసూర్యచంద్రులు క్రమముగానుండినను, లేక పైగ్రహములు ఒకటేరాశియందుండినను గర్భముధరించలేదని చెప్పవలయును-

శ్లో॥ లగ్నాదోజస్థితేచంద్రే పుత్రంయుగ్మేసమేసుతాం ।
యథానక్షత్రరాశీనాం యథాయోగంస్త్రియఃసుతామ్ ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు ఓజరాశియందు చంద్రుడుండిన పుత్రుడును సమరాశి యందు చంద్రుడుండిన పుత్రికయును కలుగునని చెప్పవలయును- మరియు ఆప్రశ్నకాలమునందు యేనక్షత్రమో ఆనక్షత్రమునకు యేరాశియోయందుండు పుంస్త్రీగ్రహబలాబలమునుపట్టి పుత్రుడు, పుత్రికయని నిశ్చయించిచెప్పవలయును-

శ్లో॥ లగ్నాత్తృతీయేనవమే దశమైకాదశేపిచ। భానుస్థితశ్చేత్పుత్రస్స్యా త్తథైవచశనైశ్చరః। ఓజస్థానగతాస్సర్వే గ్రహాశ్చేత్పుత్రసంభవః। సమస్థానగతాస్సర్వే యదిపుత్రీనసంశయః ।

తా॥ ప్రశ్నలగ్నమునకు 3, ౯, ౧౦, ౧౧ యీయిండ్లలో సూర్యుడుగాని శనిగానియుండినయెడల పుత్రప్రసవమగును- మరియు ప్రశ్నలగ్నమునకు ఓజరాశియందు

అన్నిగ్రహములుండిన పుత్రప్రసవమనియు, సమరాశియందు అన్నిగ్రహము లుండిన పుత్రికాప్రసవమనియు చెప్పవలయును-

శ్లో॥ ఆరూఢాత్సప్తమంరాశిం యావచ్ఛీతాంశురేష్యతి ।
తావన్నక్షత్రసంఖ్యాంతం దివసంసూయతేసుఖమ్ ॥

తా॥ ఆరూఢరాశియందుండిదానికేడవరాశిలో చంద్రుడుప్రవేశించువరకుయెన్ని నక్షత్రములున్నవో ఆనక్షత్రసంఖ్యగలదినములలోపల సుఖప్రసవమగునని చెప్పవలయును.

శ్లో॥ తిథిప్రహారసంయుక్తం తారకావారసంయుతమ్ ।
ఏకోనంసప్తభిర్హ్రాసం సమేస్త్రీవిషమేపుమాన్ ॥

తా॥ ప్రశ్నకాలమునందలి తిథివారనక్షత్రముల సంఖ్యలను ఒకటిగాచేర్చి ఆసంఖ్యలలో ౧ తీసి ౭ టవిభజించగా ౨, ౪, ౬ మిగిలితె పుత్రికయనియు ౧, 3, ౫ ౭, మిగిలితే పుత్రుడనియు చెప్పవలయును-

## వ్యాధిప్రశ్న.

శ్లో॥ వ్యాధిస్థానమిదంప్రాహుః మూర్ధ్నివక్త్రేభుజేకరే । వక్షసి స్తనయోఃకుక్షౌ కట్యామూలేచమేహనే। ఊరూపాదాచమేషద్యాః రాశయఃషరికీర్తితాః । కుజోమూర్ధ్నిముఖేశుక్రః స్కంధయోర్భుజయోర్బుధః । చంద్రోవక్షసికుక్షౌచ భానుర్నాభేరధోగురుః । ఊరాశనీరాహుపాదే గ్రహాణాంస్థానమీరితమ్ । ఏతేష్వేవస్థలేషుస్యా న్నష్టమేతేషు రాశిషు పాపయుక్తేషుదుష్టేషు నీచారిస్థేషురుగ్భవేత్ ।

తా॥ శిరము మేషము, ముఖము వృషభము, భుజములుమిధునము, అరచేతులు కటకము రొమ్ము సింహము, స్తనములు కన్య, కడుపు తుల, నడుము వృశ్చికము, ఆసనము ధనుస్సు, యోనిమేఢ్రము మకరము, తొడలుకుంభము, కాళ్లుమీనము అనిశరీరమునందా యారాశులను తెలుసుకొనవలయును ఇవి వ్యాధిస్థానములు మఱియు అంగారకుడు శిరము, శుక్రుడు ముఖము, బుధుడు కంఠభుజములు, చంద్రుడు రొమ్ము, సూర్యుడు నాభికడుపు, గురువుకటి తొడలు, రాహుకేతువులు కాళ్లు ఇటులగ్రహముల స్థానములను తెలుసుకొనవలయు నైస్థానములయందు పాపగ్రహంబులుండినను లేకపానివిపాపగ్రహములుచూచినను ఆస్థానంబులకధిప గ్రహంబులునీచ శత్రుక్షేత్రంబుల యందుండినను ఆయాస్థానములయందు వ్యాధిజనించియున్నదని చెప్పవలయును-

శ్లో॥ ఏస్థానమేపాపయుతే దృష్టేవ్యాధిర్నశామ్యతి । షష్ఠాష్టమేశుభయుతే రోగశాంతిశ్చజాయతే । వ్యాధిమోక్షస్తువక్తవ్యః లగ్నేతుశుభయుక్తయోః ।

తా॥ ప్రశ్నలగ్నమునకు ౬-౮ స్థానములు పాపగ్రహములతో గూడియుండినను, లేక వారిచేచూడబడినను రోగమునివర్తించదు పైస్థానములు శుభగ్రహములతో గూడియుండినను లేక వారిచేచూడబడినను రోగముశమించునని చెప్పవలయును.

శ్లో॥ రోగస్థానాద్భవేదస్తే పాపఖేటయుతేపివా ।
తత్షష్ఠేచందసంయుక్తే మరణంరోగిణాం ధ్రువమ్॥

తా॥ రోగస్థానమైన ౬ వ యింటికి ౭ వ యిల్లు పాపగ్రహములతో గూడియుండినను, చూడబడినను ఆ ఏడవయింటికి ఆరవయింటిలో చంద్రుడుండినను రోగికి అవశ్యము మరణముకలుగునని చెప్పవలయును.

శ్లో॥ ఆరూఢాన్మరణస్థానం తస్మాదష్టమగశ్శశీ । పాపాఃపశ్యంతిచేన్మృత్యుం రోగిణాంకథయేత్సుధీః । తృతీయేభానుసంయుక్తే దశమేపాపసంయుతే । దశాహాన్మరణంబ్రూయాచ్ఛుక్రజీవౌతృతీయగౌ। సప్తాహాన్మరణంబ్రూయాద్రోగిణామపిబుద్ధిమాన్ ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు ౮ వ యింటిలో చంద్రుడుండి మరణస్థానమును పాపగ్రహంబులుచూచిన రోగికి మరణము కలుగును ప్రశ్న లగ్నమునకు 3 వ యింట్లో సూర్యుడుండి ౧౦ వ యింట్లో పాపగ్రహంబులుండిన రోగికి ౧౦ దినములలోపల మరణము కలుగునని చెప్పవలయును మరియు ప్రశ్నలగ్నమునకు 3 వ యింట్లో గురుశుక్రులుండిన 3 దినములలోపల మరణముకలుగును-

శ్లో॥ ఉదయేచతురశ్రేవా పాపేత్వష్టదినాన్మృతిః । లగ్నద్వితీయగాపాపాః చతుర్దశదినాన్మృతిః । లగ్నాద్వినిధనేపాపః దశమేపాపసంయుతే । త్రిదినాన్మరణంకింతు దశమేపాపసంయుతే। తస్మాత్సప్తమగాః పాపాః మృతిర్దశదినాద్భవేత్ ।

తా॥ ఆరూఢలగ్నము ౪-౮ వీనిలో పాపగ్రహములుండిన రోగికి ౮ దినముల లోపలమరణము, లగ్నము రెండు వీనియందు పాపగ్రహములుండిన ౧౪ దినముల లోపల మరణము, లగ్నమునకు రెండు యెనిమిది పది యీయిండ్లలో పాపగ్రహము లుండిన 3 దినములలోపలమరణము ఆరూఢలగ్నమునకు ౧౦ వ యింటియందును దాని కేడవయింటి యందును పాపగ్రహములుండిన రోగికి పదిదినములలోపలమరణముకలుగునని చెప్పవలెను

## వృష్టిప్రశ్న.

శ్లో॥ జలరాశిషులగ్నేషు జలగ్రహసమీక్షితే ।
కథయేద్వృష్టిరస్తీతి విపరీతేనవర్షతి ।

తా॥ జలరాశిఆరూఢలగ్నమై దానినిజలగ్రహములు చూచిన వాన కురుసునని చెప్పవలయును అటులేకుండిన వానలేదని చెప్పవలయును.

శ్లో॥ జలరాశిషుశుక్రేందూ లగ్నాద్వృష్టిరుత్తమా । జలరాశిషుతిష్ఠంతి శుక్రజీవసుధాకరాః । ఆరూఢోదయరాశీచే త్ప్రశ్నకత్యధింవృష్టయః । ఏతేస్వక్షేత్రముచ్చంవా పశ్యంతియదికేంద్రగాః । త్రిచతుర్దివసాదంతా న్మహావృష్టిర్భవిష్యతి ॥

తా॥ జలరాశులయందు చంద్రశుక్రులుండిల మంచివర్షము కలుగునుజలరాశులు ఆరూఢలగ్నమై వానియందు శుక్రచంద్రగురులుండినను లేకవానిని వారుచూచినను అధికవృష్టికలుగును గురుశుక్రచంద్రులు ఆరూఢలగ్నమునకు కేంద్రములయందుండివారి స్వక్షేత్రోచ్చక్షేత్రములను చూచిన నాల్గుదినములు మునుముగా అధికవర్షము కురుసును.

శ్లో॥ లగ్నాచ్చతుర్థేశుక్రస్య త్వద్దినేవృష్టిరుత్తమా । కేంద్రేషు మందభౌమజ్ఞ రాహవోయదిసంస్థితాః । వృచ్ఛతో నేతికధయే దధనా ఛండమారుతః। పాపాస్సౌమ్యావిమిశ్రాశ్చేదల్పవృష్టిశ్చజాయతే। చాపస్థాభౌమరాహూచే ద్వృష్టిర్నాస్తీతికీర్తయేత్ ।

తా॥ ఆరూఢలగ్నమునకు ౪ వ యింటిలో శుక్రుండిని ఆదినమునందే విశేషవృష్టి కలుగునని చెప్పవలయును ఆరూఢలగ్నమునకు కేంద్రస్థానములో శని అంగారకుడు బుధుడు రాహువుండిన వర్షములేదనియు పెద్దగాలి కొట్టుననియు చెప్పవలెను పైకేంద్రములయందు పాపగ్రహములు శుభగ్రహములుండిన స్వల్పవృష్టికలుగుననియు, ధనూరాశియందుశని రాహువులు చేరియుండినవర్షములేదనియు చెప్పవలయును.

## కూపప్రశ్న.

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ కూపఘాతవినిర్ణయమ్। ఆయామేత్వష్టరేఖాస్స్యుఃతిర్యగ్రేఖాస్తుపంచచ । ఏవంకృతేథ వేశ్మాగ్రాన్ అష్టాంశతిసంఖ్యయా । ప్రభాగేపార్శ్వముఖోభూత్వా కోష్ఠేష్వేతేషుబుద్ధిమాన్ । ఏవంకోష్ఠద్వయంత్యక్త్వా లిఖిత్యేశదిశాంక్రమాత్ । కృత్తికాదిత్రయంన్యస్య తదధోరాద్రభంన్యసేత్ । తదుత్తరేషుతిష్షుచ పునర్వస్వాదికత్రయమ్। తత్పశ్చిమాదియామ్యేషు మఖాపిత్రావసానకం। తద్దక్షిణయుతేన్యాలీ విశాఖాన్యన్యతత్పరమ్। త్రిదక్షిణక్రమాదన్య నక్షత్రాణిచతారకాః । మధ్యాహ్నేదక్షిణాస్యస్యాస్య పృష్ఠిమాస్యేనిశాముఖే ।

అర్ధరాత్రోత్తరాననః । మధ్యాహ్నస్మఖమారభ్య మైత్రభాద్యం విశాముఖాత్। అర్ధరాత్రౌ ధనిష్ఠాద్యం పూర్వవద్గణయేత్క్రమాత్ ॥

తా॥ కూపచక్రనిర్ణయమును వచించెద- తూర్పుపడమరగా నిడివిగా ౮, రేఖలు దక్షిణోత్తరముగా అడ్డముగా ౫ రేఖలు యేర్పరచిన ౨౮ కోష్ఠములగును దైవజ్ఞుడు ప్రాతఃకాలమునందు ప్రాఙ్ముఖుడై ఆకోష్ఠములయందు ఈశాన్యదిక్కులోనుండు ౨ కోష్ఠములు వదలి 3 వ కోష్ఠము మొదలు క్రమముగా కృత్తిక మొదలు 3 నక్షత్రములు వ్రాసి పిదప ఆర్ద్రానక్షత్రమును వ్రాసి దానికి ఉత్తరముగ పునర్వసు, పుష్యమి, ఆశ్లేష ఈ నక్షత్రములను వ్రాసి దానికి దక్షిణమున మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, వీటిని వ్రాసి దానికి దక్షిణముగ స్వాతి, విశాఖను వ్రాసి తక్కిన నక్షత్రములు ప్రదక్షిణ క్రమముగా వ్రాయవలయును- మధ్యాహ్న కాలమునందు దక్షిణాభిముఖుడుగ, రాత్రియందు పశ్చిమాభిముఖుడుగ, అర్ధరాత్రియందు ఉత్తరాభిముఖుడుగనుండి మధ్యాహ్నమునందు మఖానక్షత్రము మొదలుగ, రాత్రియందు అనూరాధ మొదలుగ, అర్ధరాత్రియందు ధనిష్ఠ మొదలుగ ముందువలెనే చూడవలయును-

శ్లో॥ యన్నక్షత్రం తదాసిద్ధం ప్రశ్నకాలే విశేషతః । కృత్తికాస్థానమారభ్య పూర్వవద్గణయేత్సుధీః॥ యత్రేందుర్దృశ్యతే తత్ర సమృద్ధముదకుంభవేత్ । శుక్రనక్షత్రకోష్ఠే వా జలమస్తీత్యుదాహరేత్ । జీవనక్షత్రకోష్ఠేషు తత్రస్వర్ణముదీరయేత్ ॥

తా॥ ప్రశ్నకాలమునందు యేనక్షత్రమో అదివరకు కృత్తికాదిగా యెంచి చంద్రుడు యేస్థలమునందున్నాడో ఆస్థలమునందు శాశ్వతమైన విశేష ఉదకము దొరుకును- మరియు శుక్రనక్షత్రకోష్ఠమునందును, గురువు నక్షత్రకోష్ఠమునందును, మధురమైన వుదకము సమృద్ధిగా కలుగును-

---

శ్లో॥ తులోక్షకర్కికుంభాళి మీనవక్రాశ్చరాశయః । జలరూపాస్తదుదయే జలమస్తీతినిర్దిశేత్। తదస్తే చంద్రశుక్రౌ చేదస్తితత్ర బహూదకమ్। బుధజీవోదయే తత్ర కించిజ్జలముదీరయేత్। ఏతాన్ రాశీన్ ప్రపశ్యంతి యది న్యర్కభూమిజాః। జలం న విద్యతే తత్ర ఫణిదృష్టే బహూదకమ్ ।

తా॥ తులా, వృషభము, కటకము, మకరము, వృశ్చికము, మీనము ఇవి జలరాశులు ప్రశ్నకాలమునందు జలరాశులు ఉదయమైన ఉదకము కలదనియు, ప్రశ్నలగ్నమున కు ౪ వ యింటిలో చంద్రశుక్రులుండిన అధిక వుదకము కలుగుననియు, బుధబృహస్పతులుండిన స్వల్పవుదకము కలదనియు చెప్పవలయును-మరియు పై రాశులను శని సూర్యకు

గారములు చూచినను లేక ఆరాసులలోనుండినను ఉదకములేదనియు రాహువుచూచిన విశేషముకలదనియు చెప్పవలయును-

శ్లో॥ అధోదృష్టిగ్రహాయుతే అధశ్చోదకంభవేత్ । ఊర్ధ్వదృష్టిగ్రహేరాశౌ ఊర్ధ్వమేవోదకంభవేత్ । ఊర్ధ్వాధఃస్థలయోఃపాపాః తిష్ఠంతిదిశిచోదకం।అధోజఃంచతుర్థానం అస్తేనద్వ్యాగమోభవేత్। దశమేనవమేచైవ కేచిదాహుర్మనీషిణః । జలాజలగ్రహవశా జ్జలనిర్ణయమీరయేత్ ।

తా॥ ప్రశ్నలగ్నములో అధోదృష్టిగ్రహములుండిన లోతులో ఉదకముండునని యు, ఊర్ధ్వదృష్టిగ్రహములుండిన పైననేఉదకముండుననియు చెప్పవలయును- ఊర్ధ్వదృష్టిగ్రహములు,అధోదృష్టిగ్రహములు పాపులైలగ్నకేంద్రములయందుండిన నిర్ణయించినస్థలంబుకు సమీపంబున లోతులో ఉదకము కలుగుననియు చతుర్థకేంద్రములోయుండిన బహుప్రయాసచే బహుకాలముమీద ఉదకము కలుగుననియు అధోదృష్టి గ్రహము చతుర్థకేంద్రమునందుండిన కినీరుదొరుకుననియు, ౧౦-౯ యిండ్లలో అధోదృష్టిగ్రహముండిన విశేషజలముండుననియు చెప్పవలయును జలగ్రహము, జలములేనట్టిగ్రహము వీటినిబట్టి జలనిర్ణయమును చెప్పవలయును.

## పరాశక్తిచక్రనిర్ణయము.

శ్లో॥ పరాశక్తేఃప్రవక్ష్యామి చక్రంసర్వార్థదర్శకమ్ । ఆయామరేఖాఃపంచాపి తిర్యగ్రేకాశ్చపంచచ। విలిఖేత్తన్మధ్యకస్తత్రకోష్ఠషోడశకం కంభవేత్।గురువిష్ణుముఖాః దేవాఃతత్రతావాహ్యయథాక్రమమ్।తత్రోన్నమోభగవత్యై పరాశక్త్యైనమోస్త్వితి । మంత్రమేతంసముచ్చార్య శక్తింధ్యాత్వాపరాంశివామ్। కోష్ఠేపృచ్ఛకనిర్దిష్టే దేవతాయాప్రతిష్ఠితా । తద్దేవతానుసారేణ ఫలంబ్రూయాద్విచక్షణః ।

తా॥ సర్వకార్యసిద్ధిని విశదపరచునట్టి పరాశక్తిచక్రమునువచించెద:= నిడివిగా ౫ గీతలను అడ్డముగా ౫ గీతలను గీచిన దాని మధ్యలో ౧౬ కోష్ఠములు (అనగా ఇండ్లు) అగును- వానిలో (౧) గురువు, (౨) విష్ణువు, (౩) వాసవుడు, (౪) భృగువు, (౫)విధాత, (౬) విశ్వకర్మ, (౭) వాయువు, (౮) అగ్ని, (౯)యముడు, (౧౦)పిశాచము,

(౧౧) కుజుడు, (౧౨) ధ్రువుడు, (౧౩) చంద్రుడు, (౧౪) బుధుడు, (౧౫) కుబేరుడు, ౧౬ ఈశ్వరుడు. ఈప్రకారం ౧౬ఇండ్లలోను యథాక్రమముగా గురువు మొదలగు దేవతలను ఆవాహనముచేసి దైవజ్ఞుడు "ఓంనమోభగవత్యైపరాశక్త్యైనమః" అనుమంత్రమును జపించి ఆచక్రములో పరదేవతయగు పరాశక్తిని ధ్యానముచేసుకొని ప్రశ్న అడుగువారిని యేదైనా ఒకకోష్ఠమును చేతితోగాని పుల్లతోగాని తాకమనిచెప్పి తాకిన కోష్టములోనుండు దేవతలనుబట్టి కార్యసిద్ధ్యసిద్ధులును చెప్పవలయును,

| | | | |
|---|---|---|---|
| ౧-గురువు | ౨-విష్ణువు | ౩-వాసవుడు | ౪-భృగువు |
| ౫-విధాతా | ౬-విశ్వకర్మ | ౭-వాయువు | ౮-అగ్ని |
| ౯-యముడు | ౧౦-పిశాచము | ౧౧-కుజుడు | ౧౨-ధ్రువుడు |
| ౧౩-చంద్రుడు | ౧౪-బుధుడు | ౧౫-కుబేరుడు | ౧౬-ఈశ్వరుడు |

శ్లో॥ ఆదిమస్తుగురు స్తత్ర చింతితార్థాగమశ్శుభం । ద్వితీయోవిష్ణుదైవత్యః చింతితార్థశుభంభవేత్ । ఉద్యోగధనలాభాది చింతితార్థాప్తిరిష్యతే । తృతీయోవాసవ స్తత్ర చింతితార్థస్యసిద్ధిదః । చతుర్థోభృగురిత్యుక్తః తత్రా[illegible]సిద్ధి[illegible]ర్భవేత్ । పంచమస్తువిధాతాస్యా త్తత్రకార్యం శుభంభవేత్ । [illegible] త్రతిభవ్యఫలంభవేత్ । ఆరోగ్యంకార్యసిద్ధిశ్చ ప్రేషితార్థాగమస్సుఖమ్ । వాయుస్తుసప్తమ స్తత్ర చింతితార్థోనసిధ్యతి । అష్టమోగ్నిస్తత్రకష్టం కార్యహానిశ్చజాయతే । నవమోయముదైవత్యః తత్రవ్యాపారహానికృత్ । దశమస్తుపిశాచస్స్యాత్తత్రకార్యంనసిధ్యతి । ఏకాదశకుజస్తత్ర శత్రురోగభయంభవేత్ ।

ద్వాదశస్తుధన్వ స్తత్ర కార్యంకష్టేనసిధ్యతి । చంద్రస్త్రయోదశే స్తత్ర కార్యసిద్ధిస్సుశీఘ్రతః । చతుర్దశో బుధ స్తత్ర క్షేమకార్యాప్తిసౌఖ్యదః కుబేరః పంచదశకః ధాన్యలాభసుఖప్రదః । ఈశ్వరష్షోడశ స్తత్ర చింతితార్థోనసిధ్యతి । భవేత్కష్టదశేత్యేవం ఫలమూహ్యంమనీషిభిః ॥

## చక్రముయొక్క ఫలాఫలములు.

(౧) గురువు అయితే తలచిన కార్యము సిద్ధియగును శుభ ఫలము.
(౨) విష్ణువు అయితే తలచిన కార్యం సుఖముగ చక్కగ ఫలించును.
(౩) వాసవుడు అయితే ఉద్యోగము, ధనలాభము కలుగును.
(౪) భృగువు అయితే ఇష్టకార్యసిద్ధియగును (సిద్ధించును.
(౫) విధాతా అయితే తలచిన కార్యము శుభమగును.
(౬) విశ్వకర్మ అయితే మంచిఫలము ఆరోగ్యము కార్యసిద్ధి.
(౭) వాయువు అయితే తలచిన కార్యము కానేరదు.
(౮) అగ్ని అయితే విశేషకష్టము, కార్యహానియగును.
(౯) యముడు అయితే వ్యాపారహానియగును.
(౧౦) పిశాచము అయితే కార్యముసిద్ధించదు.
(౧౧) కుజుడు అయితే శత్రుభయము, రోగభయము కలుగును.
(౧౨) ధన్వుడు అయితే కార్యముమిగులకష్టము మీదసిద్ధించును.
(౧౩) చంద్రుడు అయితే కార్యము శీఘ్రముగా సిద్ధించును.
(౧౪) బుధుడు అయితే క్షేమము, తలచిన కార్యమగును.
(౧౫) కుబేరుడుఅయితే ధన ధాన్యలాభము కలుగును.
(౧౬) ఈశ్వరుడుఅయితే తలచిన కార్యముసిద్ధించదు.

## మరియొకశుభాశుభప్రశ్నచక్రము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ౧౧౧ | ౨౧౧ | ౧౩౧ | ౨౩౧ | ౩౧౧ | ౩౩౧ | ౪౧౧ | ౪౩౧ |
| ౧౧౨ | ౨౧౨ | ౧౩౨ | ౨౩౨ | ౩౧౨ | ౩౩౨ | ౪౧౨ | ౪౩౨ |
| ౧౧౩ | ౨౧౩ | ౧౩౩ | ౨౩౩ | ౩౧౩ | ౩౩౩ | ౪౧౩ | ౪౩౩ |
| ౧౧౪ | ౨౧౪ | ౧౩౪ | ౨౩౪ | ౩౧౪ | ౩౩౪ | ౪౧౪ | ౪౩౪ |
| ౧౨౧ | ౨౨౧ | ౧౪౧ | ౨౪౧ | ౩౨౧ | ౩౪౧ | ౪౨౧ | ౪౪౧ |
| ౧౨౨ | ౨౨౨ | ౧౪౨ | ౨౪౨ | ౩౨౨ | ౩౪౨ | ౪౨౨ | ౪౪౨ |
| ౧౨౩ | ౨౨౩ | ౧౪౩ | ౨౪౩ | ౩౨౩ | ౩౪౩ | ౪౨౩ | ౪౪౩ |
| ౧౨౪ | ౨౨౪ | ౧౪౪ | ౨౪౪ | ౩౨౪ | ౩౪౪ | ౪౨౪ | ౪౪౪ |

### తత్ఫలము.

౧౧౧ శుభంలాభంసంతోషం

౧౧౨ మంచి కార్యంకాజాలదు

౧౧౩ పుత్రిలాభంధనలాభం శుభం

౧౧౪ ఇట్లోనిస్వామిని పూజించేది పరి ఫలంపోవద్దు

౧౨౧ ఒంధుదర్శనం బహులాభం పుత్ర సౌఖ్యముకలదు

౧౨౨ లాభంసౌఖ్యంస్నేహితులవల్ల మేలు

౧౨౩ నీవుతలచిన కార్యం కాచాలదు

౧౨౪ స్వజనదర్శనంకలుగును చింతవద్దు

౨౧౧ ఈయోచనమంచిది కార్యం అవును

౨౧౨ ఇష్టదైవాన్ని పూజిస్తే కార్యంఅవును

౨౧౩ ఆత్మచింత చేస్తున్నావు కార్యం అవును

౨౧౪ దూ పుఆలోచనచేస్తే లాభంకలదు సందేహంలేదు

౨౨౧ మూడుసంవత్సరములకష్టముతర్వాత కార్యమగును

౨౨౨ ఈప్రశ్నవల్లసుఖంలేదు

౨౨౩ ఈతలంపుకాదునష్టంకలుగును

౨౨౪ ఈప్రశ్నమంచిదికాదు

౧౩౧ బహుఆశవద్దు కార్యంకాదు

౧౩౨ ఈకార్యం కాదు వేరే తలంపువద్దు

౧౩౩ ఈతలంపుమంచిది సుఖమే

౧౩౪ ఈతలంపుమంచిది శుభం

౧౪౧ యికనుసమస్తపీడలుతొలగునుమంచి

౧౪౨ ఈతలంపువల్ల బహులాభంకలదు

౧౪౩ ఈతలంపుఆలస్యంగాఅవును

౧౪౪ ఈప్రశ్నమంచిదిలాభంకలదు

౨౩౧ ఈప్రశ్నమంచిదికాదు

౨౩౨ ఈతలచినకార్యంకష్టంగాకార్యంకాదు

౨౩౩ ఈప్రశ్నవల్లలాభంకలదు

౨౩౪ ఈప్రశ్నశుభంకలుగును

౨౪౧ ఈప్రశ్నఆలస్యముగా అవును

౨౪౨ ఈప్రశ్నపరులవల్ల పరదేశం వల్ల జయంకలుగును

౨౪౩ ఈప్రశ్నకష్టంగానేరదు

౨౪౪ ఈప్రశ్నవల్లసుఖంకలదు

౩౧౧ ఈప్రశ్నలాభసౌఖ్యములుకలుగును

౩౧౨ ఈప్రశ్నమనోరథ సిద్ధిఅవును

౩౧౩ ఈప్రశ్నమంచిది మేలుకలుగును

౩౧౪ ఈప్రశ్నఆలస్యంగాఅవును

౩౨౧ ఈప్రశ్నవల్ల రాజభయంకలుగును

౩౨౨ ఈతలచినప్రశ్న శీఘ్రంగాఅవును

౩౨౩ ఈతలచినప్రశ్న నిలకడగాఅవును

౩౨౪ ఈప్రశ్న రాజువల్ల సౌఖ్యంకలదు

౩౩౧ ఈప్రశ్న శీఘ్రంఅవును

౩౩౨ ఈప్రశ్న మంచిది శీఘ్రంగాఅవును

౩౩౩ ఈతలచినకార్యంఅవును

౩౩౪ ఈప్రశ్న మేలుశుభం అవును

౩౪౧ ఈప్రశ్న అవును వేగిరపడవద్దు

౩౪౨ ఈప్రశ్న మంచిది మేలుకలుగును

౩౪౩ ఈప్రశ్నవల్లకుటుంబచింతసౌఖ్యం సుజనదర్శనం అవును

౩౪౪ ఈప్రశ్నవల్ల మేలుకలుగును

౪౧౧ ఈప్రశ్నమూడుసంవత్సరములకష్టం అతర్వాతసుఖంకలదు

౪౧౨ ఈచింతపరదైవమువలఅవును

౪౧౩ ఈప్రశ్నవల్ల లాభంకలుగును

౪౧౪ ఈప్రశ్నవల్లమేలుకలుగును లాభమున్ను జయమున్ను కలుగును

౪౨౧ ఈకార్యంఆలస్యంగాఅవును

౪౨౨ ఈప్రశ్నవల్ల రాజభయంకలదు శత్రువులుచెడుదురు కార్యసిద్ధిఅవును

౪౨౩ ఈప్రశ్న మంచిది లాభంకలదు

౪౨౪ ఈప్రశ్నఆలస్యంగా అవును

౪౩౧ ఈప్రశ్న మహా మేలు శుభలాభం కలుగును

౪౩౨ ఈప్రశ్నవల్లశుభలాభం కలదు

౪౩౩ ఈప్రశ్న వకమనిషి మూలముగా అవును జయంకలదు

౪౩౪ ఈప్రశ్నవల్లలాభంకలదు

౪౪౧ ఈకార్యంకాచాలదు

౪౪౨ ఈప్రశ్న కార్యం శీఘ్రంగాఅవును

౪౪౩ ఈకార్యం నష్టి మేలులేదు

౪౪౪ ఈప్రశ్న మేలుకలదులాభంకలుగును

## దేవతాప్రశ్న.

| | | తూ | | |
|---|---|---|---|---|
| | ౮<br>స్త్రీ చిక్కు | ౧<br>శరీర పీడ | ౨<br>స్త్రీ చిక్కు | |
| ఉ | ౭<br>దేవునిపీడ | ౯<br>నవగ్రహదోషం | ౩<br>దేవునిచిక్కు | ద |
| | ౬<br>పిశాచపీడ | ౫<br>శరీరపీడ | ౪<br>పిశాచపీడ | |
| | | ప | | |

ఆదివారంబున ౯ పుష్పములు పైచక్రంబున పూజించి తాంబూల ఫలదక్షిణములు సమర్పించి సమర్పించినవన్నియు లెక్కబెట్టి ఆ మొత్తమును ౨ చే గుణించి ౧౨ కలిపి ౯ చే భాగించగా మిగిలిన శేషమును తెలిసికొని ఆసంఖ్యగల ప్రదేశంబున వ్రాసినఆఫలమును చక్రమునందుచూచుకొని చెప్పవలెను అందుకు శాంతిచేసినచో నివర్తించునని తా॥

## వారప్రశ్న.

| | |
|---|---|
| ఆది | ౧- ౨- ౩- ౪- ౫ |
| సోమ | ౬- ౭- ౮- ౯- ౧౦ |
| మం | ౧౧- ౧౨- ౧౩- ౧౪- ౧౫ |
| బు | ౧౬- ౧౭- ౧౮- ౧౯- ౨౦ |
| గు | ౨౧- ౨౨- ౨౩- ౨౪- ౨౫ |
| శు | ౨౬- ౨౭- ౨౮- ౨౯- ౩౦ |
| శ | ౩౧- ౩౨- ౩౩- ౩౪- ౩౫ |

౯ చే భాగించిన శుభగ్రహములు మంచిది అనగా ౨- ౪- ౫- ౬ మంచివి ౧- ౩- ౭- ౮- ౯ చెడ్డఫలంబు గలవని భావము.

ఉదహరణ,

శుక్రవారంబున బ్రాహ్మణుడు ప్రశ్నకువచ్చెను బ్రాహ్మణజాతి ౧కు

ఇవ్వ 3తూ ౪వారి ౧ సంఖ్య ఆదివారంబునను౦డెను యీమధ్య ౪ వారములు గలవు. ౪ సంఖ్య బుధుడుగాన ప్రశ్నకువచ్చిన బ్రాహ్మణునకు శుభఫలములు గలదని చెప్పగలెను.

శూద్రుడు ఆదివారంబున ప్రశ్నకువచ్చెను శూద్రజాతి ౪ సంఖ్య ఆదివారంబున నేనుండెను గనుక ఫలము కలుగునని చెప్పవలెను.

## షోడశాక్షరీ ప్రశ్న చక్రము.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఇ | ఉ | దే | భో | అ | గ్ర | సా | స | గ | ఈ | ధ |
| ణూ | శా | స | ప్ర | ను | ష్టా | పా | వ | గా | ద్ర | వా | ధా |
| హా | గ | శ్వ | ర్మ | ర్వ | టి | త్యే | య | కూ | ర్థ | య | తా |
| వే | ష్ట | చా | ర | య | వ | రా | బ | ప్ర | ల్యం | న | శ్న |
| లం | సి | సా | ప్ర | షా | శా | ర | ణ | లా | త్ర్వా | ను | లే |
| ణ్యా | త్య | చిం | బ | భ | ద్ధి | ధ | సా | వ్య | లా | శాం | జ |
| భే | సా | గ్ర | న | ను | క్ర్వా | తి | లే | వ | ర్భ | నం | దే |
| స | ను | తిః | యు | కా | దే | హా | యో | రూ | ను | తం | న |
| తి | వి | చి | న | వ | స | క | లా | ర్య | న | ణ | గ |
| పం | ఖీ | సి | ఫ | కా | వ్య | రా | కా | క | ర | ర్త | భ |
| సి | క్షే | సా | క్షే | ఫ | భ | ధ్య | లా | ర్యం | తి | య | ర్యం |
| రీ | ణం | వ్యా | శ్చ | ద్ధిః | మం | ఖ్యం | మం | లం | వ | తి | ని |

అనుకూలంభవతికార్యం ఇష్టార్థసిద్ధిర్భవిష్యతి ఉపాయసాధనం చిరాయ దేవతాప్రసాదేనకార్యం భోగాపేక్షావ్యసనకరి అదృష్టకాలానుసరణం గ్రహాచారశాన్తిః శత్రువ్యాపాధారణజయలాభశ్చ సహాయలాభే కార్యసిద్ధిః భగవత్ప్రసాదేన క్షేమం యాత్రానుగ్రహేణసౌఖ్యం ధర్మబలేనరోగక్షేమం పూర్వపుణ్యానురూపంఫలమ్ కాటిల్యం తస్యకార్యసుఖీభవ సత్యేనచింతితంసిద్ధ్యతి ప్రయత్నబలేనఫలాని.

ఒకయిల్లుతాకించిఅదిమొదలు ౧౬- వ అక్షరములవంతునవ్రాసికొనిప్రశ్నఫలమును చెప్పవలయును.

## గ్రహసంఖ్యాప్రశ్న.

౧ కటక (౧- ౧- ౧) స్వవితాసిద్ధిః ౨ ప్రియాంగు (౨- ౧- 3) శ్వశత్రుత్సౌఖ్యం 3 శ్రియదారి (౨- ౨- ౨) భూమిజోనాశః ౪ గోష్ఠం (3- ౧- ౨) జనుస్సౌఖ్యభవేత్

౫ లాంగలః (౩- ౩- ౩) వాక్పతేర్జ్యం ౬ గోత్రాయ (౩- ౨- ౧) సితఉత్తమం ౭ కుంగో (౧- ౨- ౩) గ్రజ ఆర్తిస్స్యాత్ ౮ కాలాకో (౧- ౩- ౨) రాహుర క్షేమం ౯ రోగాఖ్యో (౨- ౩- ౧) మరణంకేతుః.

## ప్రశ్నచూచెడిక్రమము.

పృచ్ఛకుని ౧౦౮ లోపుగా నొకసంఖ్యచెప్పుమని ఆసంఖ్యనువ్రాసికొని ౧౦౮ లో ఆసంఖ్యపోను మిగతలోనొక సంఖ్యచెప్పుమని దానినివ్రాసికొని, దానిలోనదిపోగామిగిలినదానినికూడ వ్రాసికొనునది ఆమూడుసంఖ్యలను ౩ చే భాగించితే శేషములు ౩ నిలుచును ౦ శేషమయినదానిని ౩ గానేపెట్టుకొనునది ఆసంఖ్యలమీద నీవాక్యగత ఫలము చెప్పవచ్చును ఇదితప్పక ఫలించుచున్నది యీసంఖ్యామర్మము తెలియనివానిచే లెక్క చెప్పింపనగును

## నారదతంత్రయుక్త కంథాప్రశ్నః.

శ్లో॥ గవాభామేతథాదూరే శనాచపరిపీడ్యతే। బుధేచంద్రేతథామారే సమీపేగురు శుక్రయో॥ ౧॥ నిర్జవస్సప్తబుష్పాణి సజీవోద్వాదశోభవేత్ । వ్యాధితోనవబుష్పాణి సూర్యతిష్ఠ్యాత్తుచాంద్రభమ్॥ ౨

## బాలప్రశ్న.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ౮ | ౯ | ౧౬ | ౧౭ |
| ౨ | ౭ | ౧౦ | ౧౫ | ౧౮ |
| ౩ | ౬ | ౧౧ | ౧౪ | ౧౯ |
| ౪ | ౫ | ౧౨ | ౧౩ | ౨౦ |

ఈచక్రమునందు ఆదివారదినంబున ౨౦ పుష్పములుంచి తనకిష్టమైనపుష్పమును ఎత్తుకొనేది, ఆచోటవుండు సంఖ్యను ౯ చే భాగించగా మిగిలినశేషము ఫలము చెప్పవ

లెను. 1 శరీరపీడ, 2 వాతప్రకోపము, 3 ఉష్ణదోషము, 4 బాలగ్రహదోషము, 5 ఇంటి పీనుల్లదోషము, 6 స్త్రీప్రతిబంధకదోషము, 7 పరపీడదోషము, 8 పిశాచపీడదోషము, 9 నవగ్రహదోషమని చెప్పఁబడెను. వీనిలో 2, 4, 6, 5, సంఖ్యలు శాంతిలేకపోయినను బాలునికి క్రమక్రమసౌఖ్యముకలుగును. కడమసంఖ్యలు మంచివికావని చెప్పందగును.

## గ్రంథపరిష్కృతిః.

శ్లో॥ శ్రీచెల్లావంశజాతేన నాగలింగాఖ్యసూనునా। సూరిబృందవిధేయేన మచిలీపురవాసినా। త్రిస్కంధశాస్త్రవిదుషా లక్ష్మీనృసింహసూరిణా। ప్రశ్నదర్శనికాఖ్యోయం గ్రంథో వై ముద్రితో మయా। భగవత్ప్రీతయేస్తు సదా విజయతేతరామ్॥

శ్లో॥ అబ్ధ్యబ్ధిగజచంద్రేషు శాలివాహనగతేషుచ। శ్రీముఖాఖ్యవద్వత్సరే శ్రావణేపూర్ణిమాతిథౌ సోమవారేతుసంపూర్ణ మాసీత్ప్రథమముద్రణమ్॥

అయ్యా! .........................................................

ఈఆరూఢప్రశ్నశాస్త్రము పూర్వము పరమేశ్వరుడు పార్వతికుపదేశించెను పార్వతీదేవివలన ఋషులుగ్రహించి వారివారిశిష్యులకుపదేశించిరి వానిలో మనపూర్వులందఱు కొంతభాగమును సంపాదించి పఠింపసాగిరి ఆశ్లోకములన్నియును రానురానుఖండాఖండములైపోయెను. ప్రస్తుతం దొరికినవానినైనను ప్రకటించుటముఖ్యమనితోచి యీకూర్పునందు ఇంతటితో ముగింపచేసితిని. మరియు వీనియందుఁ లోపములున్నచో వానినిసవరించి నాకుఁదెలిపిన పునర్ముద్రణమందు సవరించఁబడును, ప్రాజ్ఞులకు విశేషము విన్నవింపఁబనిలేదు.

బందరు
బచ్చుపేట.

ఇట్లు,
చెల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.

ఈ గ్రంథములు వలయువారు, మచిలీపట్టణమునందుండు

శ్రీఆర్యానంద ముద్రాక్షరశాలాధికారియగు,

వేల్లా. లక్ష్మీనృసింహ శాస్త్రిగారికి వ్రాసి వి-పి పోష్టులో తెప్పించుకొనవచ్చును

---

ఆశీర్వచనమంత్రార్థము 0-4-0

ఆశ్వలాయనపూర్వప్రయోగము స్వరసహితము 2-0-0

ఆశ్వలాయన స్మార్తప్రదీపిక ప్రథమభాగము సులభప్రయోగబోధక గ్రంథము 0-8-0

ఆబ్దికశ్రాద్ధవిధిధర్మశాస్త్రము తాత్పర్యసహితము, 0-2-0

ఆశ్వలాయన ఆబ్దిక మంత్రము సస్వరగ్రంథధర్మశాస్త్ర తా॥స 0-8-0

ఆశ్వలాయనసంధ్యావందనం 0-2-0

అశ్వత్థప్రతికల్పము, యిందు ఉపనయన, వివాహ, పూజావిధాన ప్రదక్షిణక్రమము మొదలగు విషయములుగలవు. తాత్పర్యసహితము 0-2-0

ఆకాశ దీపవ్రతము తా॥స॥ 0-1-6

అక్షరాభ్యాస ప్రయోగము 0-2-0

ఆపస్తంబ గృహ్య సూత్రము 0 2-0

ఆధాన పంచకము 1-0-0

కాంస్యపాత్ర ప్రతికల్పము 0-2-0

ఆశ్వలాయన దేవతార్చనము 0-2-0

ఆశ్వలాయనఅపరప్రయోగానుక్రమణిక బహువిషయములుచేర్చి సులభప్రయోగములతో ముద్రింపబడినది స్వరసహితం 1-8-0

ఆశీర్వచనమంత్రదర్పణము (స్వరం) ఇందనేక ఆశీర్వచన మంత్రము లుండును, శుభవచనములు చేరినవి చివరకట్టుస్వస్తివాచనముకూడ గలదు బైండుచేయబడినప్రతి । 0-12-0

హనుమద్వ్రతము తా॥ స 0-2-0

ఆపస్తంబ ఆబ్దికమంత్రము 0-6-0

అధిశ్రవణము, ఇందునాచికేతాంతము వఱకునుసస్వరంగలది శ్రాద్ధకాలంబున పఠింపునవి రు 0-4-0

సస్యానందము జ్యోతిషము వర్షము సంగతి కాలమానస్థితులన్నియును ప్రతివారును తెలియకొనవచ్చును, తాత్పర్యసహితము రు 0-4-0

అన్నసూక్తార్థదర్పణము తాత్పర్య సహితము(సస్వరము) ఇదిబ్రాహ్మణమాత్రులందఱు శ్రాద్ధకాలమున పఠించు అన్నసూక్తమంత్రంములకర్థము(ఇదిస్వయముగానాదదగును టీకాతాత్పర్యసహితము గానున్నది 0-8-0

ఆరాధనప్రయోగము 0-2-0

అమావాస్యతర్పణము ఇందనేక విషయములుండును 0-1-0

ఆర్తవచంద్రిక, జ్యోతిషగ్రంథము తాత్పర్యసహితము మనయిండ్లో వుండే ఆడపిల్లలు ప్రథమపుష్పవతి కాగానే స్వయముగా యతరికివారు అప్పుడుండుతిథివారాది దోషములుసుగుణములుచూచు కొనేజ్యోతిష్యగ్రంథము 0-5-0

ఆశౌచనిర్ణయదర్పణము తా॥ స 0-4-0

ఆపస్తంబగోత్రప్రవరలు 0-2-0

హనుమత్ప్రతిష్ఠ తా॥ స 0-1-6

శ్రీసూక్త విధానము ఇందులలితాసహస్రనామములు మొదలగునవి గలవు 0 2 6

సావిత్రీగౌరీవ్రతము 0 1 6

శ్రావణమంగళగౌరీవ్రతం 0 2 0

సూర్యనమస్కార దర్పణము ఇందుఅరుణము, సౌరము, మొదలగు చిల్లర స్మార్త విషయములన్నియుగలవు సస్వరం 0 8 0

శూద్ర కమలాకరస్మృతి పూర్వ ప్రయోగము ఇందువిషయులును వివాహాది ప్రయోగములును, కమలాకరస్మృతికారికలనువారి కలు గ్రంథమును జూడనగును సూచి ప్రయోగబోధక పుస్తకము బైండుది 1 4 0

స్త్రీశూద్రప్రాయశ్చిత్తం 0-2-0

సీతారామజన్మోత్సవములు 0 4 0

వివాహం (ఇతరులది) 0-4-0

శూద్రాచారము—సులభశైలిగా ముద్రించితిమి ధర్మశాస్త్రసాంప్రదాయము లన్నియుగలవు 1 0 0

సింధూస్నానమాహాత్మ్యం 0 1 6

శ్రీసూక్తం సస్వరం భాష్యం 0 2 0

స్మార్తకారికావృత్తి ఇది నృసింహప్రోక్తము స్మార్తులందరు ముందుగా జూడవలసిన సద్గ్రంథము షోడశకర్మలయొక్క విధానముగలది 0 12 0

శూద్రాబ్దిక ప్రయోగం 0 2 0

గురుగీతాసారము వేదాంతం 3 0 0

రసయోగరత్నాకరము 1 0 0

లలితాసహస్రనామములును ఇందుమూలమునుగలది 0 4 0

విష్ణుసహస్రనామములు మూలముసహా 0 4 0

నిర్ణయసింధువు 2 0 0

కాశీయాత్రప్రకాశిక 1 6 0

వైశ్యధర్మదీపిక వైశ్యులకు అత్యంతోపయుక్తమైనది 1 0 0

భక్తియోగము. ప్రతిమనుజుడు చదివియేతీరవలెను. 0 12 0

శివలింగ ప్రతిష్ఠ 0 4 0

భగవద్గీతలు తా-స 1 4 0

స్వర్గశాస్త్రముజ్యోతిషము 1 8 0

మానవ ధర్మచంద్రిక 2 0 0

స్త్రీధర్మరత్న భాండాగారము 2 0 0

షష్ఠీపూర్తివ్రతము 0 4 0

| | | | |
|---|---|---|---|
| చమకము స్వరార్థసహితము | 0 8 0 | ధర్మ సంగ్రహము | 0 2 0 |
| స్మార్తకర్మలు 6 కర్మలుకు యానసహితము | 0 8 0 | సకలార్థ సాగరము | 2 0 0 |
| అపరకృష్ణీయము ఇదిధర్మశాస్త్రసాంప్రదాయము లక్ష్మియు చేర్పించిముద్రింపబోవుచున్నారము | 2 8 0 | వైశ్యధర్మప్రకాశిక 1 క | 3 0 0 |
| కాండానుక్రమణిక | 0 6 0 | రేంపు ఆశీర్వచనమంత్రము | 0-0-6 |
| జ్ఞానోదయశైలి అన్ని సంవత్సరములకుఉపయోగించును | 0 6 0 | బాలాసహస్రనామస్తోత్రము | 0 6 0 |
| ఉపనయనముఆత్మార్చిసారిధి | 0 4 0 | జ్ఞానామృతము మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథము 3 వ కూర్పు | 0 0 6 |
| అబ్దికమంత్రము స్వరక్రియ తో మూడవకూర్పు | 0 4 0 | సుందరకాండము, ఆంధ్ర తాత్పర్యసహితము | 1 8 0 |
| వైశ్యశాంకరియ ఖండనము మూడవకూర్పు | 0 4 0 | రుద్రాధ్యాయము | 1 4 0 |
| అప్పకవీయము ఛందశాస్త్రము | 1 0 0 | శివరాత్రిమాహాత్మ్యము | 0 10 0 |
| స్త్రీపునప్రాయశ్చిత్తము | 0 2 0 | దేవీస్తోత్రికదంబము | 0 4 0 |
| శైవాపరప్రయోగాను క్రమణికసన్నరము | 1 0 0 | అనంతోపనిషత్తుతా-స | 0 6 0 |
| శైవశివ పూజావిధి | 0 2 0 | భక్తలీలా మృతం | 1 0 0 |
| జనేంద్రమాలజోతిషగ్రంథము అచ్చులోనున్నది | 0 8 0 | సంతానదీపిక జ్యోతిషము | 0 8 0 |
| పరాశరస్మృత్యుక్తవైశ్య | | సూక్తప్రకాశిక | 0 2 0 |
| | | వాస్తుదర్పణము జ్యోతిషము అచ్చులోనున్నది. | 0 6 0 |
| | | గరుడపురాణం తా-స | 2 0 0 |
| | | వైశాఖపురాణము తా-స అచ్చులోనున్నది | 1 4 0 |
| | | గురుశిష్యవైద్యచింతామణి | 1 12 0 |

(పరా) అయ్యా ! మావద్దయింకను ఇతరగ్రంథములు గూడ గలవు ముందు ముద్రింపబోవు కేట్లాగుచూచిన విశదమగును.

